DVK01K320



# పురుషాహంకారానికి సవాల్!

తారాబాయి షిందే

DVK01K320

# పురుషాహంకారానికి సవాల్!

తారాబాయి షిందే

తెలుగు : C.L.L. జయప్రద



హైదరాబాద్ బుక్ ట్రస్ట్

వెల : రు. 16/-

ఆంగ్లమూలం : A Comparison between Women and Men : Tarabai Shinde and the Critique of Gender Relations in Colonial India, Rosalind O'Hanlon, Oxford University Press, Madras, 1994 ©OUP 1994

మరాఠి మూలం : స్త్రీ-పురుష తులనా, పూణే, 1882

ముఖచిత్రం : ముంబాయి ఆడపిల్లల బడి, 19వ శతాబ్ది దృశ్యం

ప్రథమ ముద్రణ : ఆగస్టు, 1999

ప్రతులకు, వివరాలకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, 1-1-16/10C, జవహర్‌నగర్, హైదరాబాద్-500 020 ఫోన్ : 7611232

---

ముద్రణ : ఓం సాయి గ్రాఫిక్స్, 3 4-709, నారాయణగూడ, హైదరాబాద్-27

# విషయ సూచిక

# स्त्रीपुरुषतुलना.

अथवा

स्त्रिया व पुरुष यांत साहसी कोण हें स्पष्ट करून
दाखविण्याकरितां हा निबंध

ताराबाई शिंदे यानीं रचिला.

बुलठाणें.

प्रांत वऱ्हाड.

पुणें येथें

"श्री शिवाजी" छापखान्यांत छापिलें.

सन १८८२ इ०

किंमत ९ आणे.

# స్త్రీ పురుషుల మధ్య తారతమ్యం



స్త్రీ పురుషులలో ఎవరు నిజంగా దుష్టులో నీతి నియమాలు
లేనివారో తెలియజేసే వ్యాసం



తారాబాయి షిందే



బుల్ ఠాణే
వర్‌హాడ్ జిల్లా



ముద్రణ :
శ్రీ శివాజీ ప్రెస్, పూణే
1882
9 అణాలు

# ముందుమాట

ఈ అద్భుతమైన విశ్వాన్ని సృష్టించిన భగవంతుడే స్త్రీ పురుషుల్ని కూడా సృష్టించాడుకదా! కనుక స్త్రీల శరీరాలే అన్నిరకాల దుర్గుణాలకీ, చపలత్వాలకీ పుట్టిళ్ళనటం న్యాయమేనా? లేక మనకి స్త్రీలలో కన్పించే దోషాలే పురుషుల్లో కూడా ఉన్నాయా? నేనీ విషయాన్ని స్పష్టాతి స్పష్టంగా నిరూపించటానికే, నాదేశం లోని సోదరీమణులందరి గౌరవం కాపాడటానికి ఈ చిన్న పుస్తకం రాశాను. నేనిక్కడ ప్రత్యేకించి కొన్నికులాలూ, కుటుంబాలగురించి విశదీకరించలేదు. ఇది స్త్రీపురుషుల మధ్యసమాజం చూపించే తారతమ్యాలను ఎత్తి చూపటానికి చేసిన పరిశీలన.

ఇకపోతే విధవా వివాహం గురించి బ్రాహ్మణ కుటుంబాలుమాత్రమే విధవలను మళ్ళీ పెళ్ళి చేసుకోకుండా అడ్డుకుంటున్నా యనేది నిజంకాదు. ఇతర కులాలూ, కుటుంబాలెన్నో ఈపనే చేస్తున్నాయి. ప్రభూలు, షెన్వీలు, గుజరాతీలు, భాటీయాలు, మార్వాడీలు, మరాఠాలు, దేశాయ్‌లు, దేశ్‌ముఖ్‌లు, ఇనాందార్లు, షిర్కేలు, మహాదిక్, జాదవ్, భోస్లేమానే పేరుగల షోలాపూర్, సతారా, పూనే, గ్వాలియర్ పట్నాల్లోని మరాఠాకుటుంబాలు, మరాఠా ఆధిపత్యం కోసం పోరాటాలు జరిపి మరణించిన కుటుంబాలు. వీళ్ళ కుటుంబాలలో బ్రాహ్మణుల కంటే ఎక్కువ కఠినంగా విధవల పునర్వివాహానికి వ్యతిరేకంగా కట్టుబాట్లున్నాయి. ఈ కుటుంబాల్లో ఒక స్త్రీ జీవితాంతం వేచి ఉన్నా పునర్వివాహం మాత్రం కాదు. ఒక భర్త పోయాడా ఆమె గడప దాటి వెళ్ళిపోయినా సహిస్తారు కాని ఇంకో భర్తని మాత్రం పొందనివ్వరు.

ఇంక నేను రాయదలచుకున్న రెండో విషయం మన దేశంలో ఒక ప్రాంతమో, ఒక కులమో దొరల అలవాట్లు చేసుకోలేదు. జనాలు బట్టలువేసుకొనే పద్ధతే చూడండి. అన్ని కులాల్లోనూ, చివరకు రాజులు రాకుమారుల్లో కూడా, పద్ధతులు మారిపోయాయి. ఒకప్పుడు జరీపట్టువస్త్రాలు, బంగారువెండిజరీలు, ముత్యాలూ రత్నాలు పొదిగిన తలపాగాలు, నగిషీ పువ్వులు కుట్టిన తలపాగాలూ, చందేరావస్త్రాల తానులూ, పఠాన్‌లో తయారయ్యే తొమ్మిదిగజాలచీరలూ, జరీఅంచుగల అంగవస్త్రాలూ, నాగపూర్‌లో నేసిన ధోవతులూ, మెత్తటిఎర్రని చెప్పులు ఇవన్నీ తయారుచేసిన ఆ ప్రదేశాలన్నీ ఇప్పుడేమయ్యాయి? ఎప్పుడైతే తమభర్తలు కొత్త కొత్త వేషాలూ, బికారి పద్ధతులూ మొదలు పెడతారో ఆడవాళ్ళు కూడా అవే వ్యవహారాలు మొదలుపెడతారు. కాకపోతే ప్రస్తుతానికి వీళ్ళు ఇంగ్లీషు వనితలు వేసుకొనే పొడుగుగౌనులపై మోజుపడటంలేదు. అయితే వీళ్ళు రకరకాల మడతలతో కుట్టిన పొడుగు చేతులకోట్లు, జాకెట్లు, కాళ్ళకు మోకాళ్ళపైదాకావచ్చే మేజోళ్ళుధరించటం మొదలుపెట్టారు.

ఈ రోజుల్లో మహిళలు మెడలో ఒక్క మంగళసూత్రం మాత్రం సన్నటిపూసలతో గుచ్చినహారంలో వేసుకోవటానికి ఇష్టపడుతున్నారు. జనం ఏమనుకుంటారోననే భయంతోనే చిన్నకుంకుమబొట్టు ఒకటిమాత్రమే పెట్టుకుంటున్నారు. భృకుటి మధ్య చిన్న బఠాణీబద్దంత బొట్టుపెట్టి, మిగిలిన నుదురంతా తెల్లగా బోడిగా వదిలేస్తున్నారు. ఈ రోజుల్లో పురుషులు పూర్వకాలపు కంఠాభరణాలూ, ఉంగరాలూ, వేసుకోవటానికి ఎలా అవమానకరంగా భావిస్తున్నారో స్త్రీలు కూడా అలాగే నగలు పెట్టుకోవటానికి సిగ్గుపడుతున్నారు. వాళ్లు సామాన్యమైన రెండు రూపాయలది తెల్లదో, రంగుదోచీర నూలుజాకెట్టు ధరించి ఆభరణ రహితంగా శివుని వరించబోయిన పార్వతి లాగా కనబడటానికి ఇష్టపడుతున్నారు. కనుక నేను ముఖ్యంగా చెప్పదలుచుకున్నదేమిటంటే మనదేశంలో ఇప్పుడు ఇంతకు ముందులా భాగ్యవంతమైన స్థితిలేదు. పూర్వపు భోగాలన్నీ మట్టి గొట్టుకుపోయాయి. పఠాన్‌లో తయారయ్యే అందమైన చీరలు దాదాపు అయిదు వందలు విలువ చేసేవి, ఇప్పుడెక్కడా కనబడటంలేదు. పశ్చిమ భారతదేశంలో విలువైన బట్టలనేతకు

ఒకప్పుడు ప్రసిద్ధి పొందిన ధన్‌వాడు, నాగపూర్, బర్తన్‌పూర్, షోలాపూర్, అహ్మదాబాద్ లాంటి పట్నాలన్నీ ఇప్పుడు ముఖాలు చాటేసినట్లే. వాళ్ళ బట్టలకు బదులు ఇప్పుడు విదేశాల్లో తయారయిన నాజూకైన వస్త్రాల తానులు ఇంటికో జండాలాగా ఎగురుతున్నాయి.

నిజానికి పురుషులవల్లే బికారి వేషాలూ, కొత్త కొత్త బడాయిలు జనాల్లోకి వచ్చి మన దేశంలో స్వతహాగా ఉన్న చేతి వృత్తులు దెబ్బతిని, మన వ్యాపారులు, వృత్తిపనివాళ్ళు ఆకలితో మలమల మాడిపోతున్నారు. మన వైభవమంతా దెబ్బతిని లక్ష్మిని మనం మన ఇళ్ళలో ఉండమని బ్రతిమాలుతున్నా వినకుండా, మీ బికారివేషాలు, మలినమైపోతున్న మీ అలవాట్లు చూసి ఆమె మనను వదలేసి దూరతీరాల దారిపట్టింది. అందుకే విధవస్త్రీలపైనా, జీవితాధారాలు కోల్పోయిన పురుషుల భార్యాపిల్లలపైనా మీకు జాలి కలగాలని ఈ చిన్న పుస్తకం మీ ముందుంచుతున్నాను. మీమగవాళ్ళు కొంచెం కళ్ళు తెరచి, మీ దేశం వైపు ఒకసారి దృష్టి సారించి, దానిపై కొంచెం గర్వం పెంపొందించుకుంటారనీ, మీలో ప్రతి ఒక్కరూ మీ మాతృభూమి ధర్మాన్నీ, అలవాట్లనీ, ఆచారాల్నీ వదిలేయరనీ ఆశిస్తున్నాను. మీరు ప్రతి మహిళనీ ఒక పాపిగా భావించి ఆమె జీవితం నరకప్రాయం చెయ్యాలనే ప్రయత్నాలు ఇకముందు ఆపేస్తారనేఆశతో ఈ పుస్తకం రాస్తున్నాను.

కానీ పూర్వపు మరాఠా పద్ధతిలో నాలుగు గోడల మధ్యన బంధించిఉంచిన, పెద్దతెలివితేటలులేని సామాన్యమైన స్త్రీని నేను. ఇది నా మొట్టమొదటి ప్రయత్నం కనుక ఇందులో కొన్ని అంతన పొంతనలేని విషయాలూ, ముక్కలుగా ఉన్న భాగాలూ ఉన్నాయి. కొంత పూర్వపు మరాఠాలువాడే మొరటు, కఠినమైన భాషలో కూడా రాశాను. కానీ ప్రతి రోజూ మనం కొత్తగా మగవాళ్ళు చేసే వింత వింత సిగ్గు లేని పనులూ, క్రూరమైన చర్యల గురించి వింటున్నాము. ఎవరూ ఆ విషయాల గురించి ఒక్క ముక్కకూడా మాట్లాడటంలేదు. పైగా ప్రతిఒక్కరూ స్త్రీలనే నిందిస్తూ దోషమంతా వాళ్ళదే అన్నట్లు తరచూ మాట్లాడుతూఉన్నారు. ఇవన్నీ చూసిన నామనస్సు స్రీలు గౌరవం కోసం తల్లడిల్లిపోయింది. ఇంకేం నాభయమంతా పోయింది. ఇలా పరుషమైన భాషలో రాయకుండా ఉండలేకపోయాను. నిజానికి మీమగవాళ్ళంతా కలిసి కట్టుగా ఉండి ఒకళ్లనొకళ్లు సమర్థించుకునే తీరును వర్ణించటానికి ఇంకా పరుషమైన మాటలు దొరికి ఉంటే వాటిని నా మోటైన పద్ధతిలో వాడేదాన్ని. ఎందుకంటే మీమగవాళ్ళందరూ ఒకలాంటవాళ్ళే అబద్ధాలకీ, కుళ్ళుకుతంత్రాలకీ కూపాలు. కానీ నేను ప్రకృతిలోని శక్తిలేని భాగం నుండి వచ్చిన దాన్ని కనుక మీరు కొన్ని లోటుపాట్లు ఈ పుస్తకంలో చూస్తారు. బలమైన మీ మేధాశక్తితో మీరు ఇందులో ఎన్నో దోషాలు పెతగ్గలరు. మీవారిని పొగడటానికి ఎన్నో కొత్త విధానాలు కూడా మీరు కనుక్కోవచ్చు. కానీ నేనిక్కడ చేసింది నాకళ్ళతో నేను చూసింది రాయటం మాత్రమే. కనుక నేను ఈ పుస్తకాన్ని పక్కకునెట్టేయద్దనీ, జాగ్రత్తగా చదవమనీ, కొంతైనా సమర్థించమనీ మొదలైన సామాన్యమైన కోరికలు మిమ్మల్ని కోరటం లేదు. నేనడిగేదల్లా మీరు నిజంగా విశాలమైన దృక్పథం ఉన్నవారైతే, ఈ విషయాల గురించి కొంచెం జాగ్రత్తగా ఆలోచించమనీ, నేను చెప్పినవి నిజమో కాదో తరచిచూడమనీ. అలా కాక మీరు మీపేరు ప్రతిష్టలు కాపాడుకునే తపనలో గుట్టున్నిదౌడుతీయించేసారంటే, దానికి నాదగ్గర విరుగుడు మంత్రమేమీలేదు. అయినా సరే, నేను ఒక్కతెనే నిరంతరం పోరాటం చేస్తూ నావాళ్ల బాగుకోసం ప్రయత్నిస్తూ, వాళ్ళ మనస్సులో సద్బుద్ధి కలగటానికి బీజాలు నాటుతూనే ఉంటాను.

తారాబాయి షిండే

# పురుషాహంకారానికి సవాల్!

(స్త్రీ పురుషులలో ఎవరు నిజంగా దుష్టులో నీతి నియమాలు లేని వారో తెలియజేసే వ్యాసం)

పూనే 1882

**తారాబాయి షిందే**

ఈ రోజుల్లో వార్తా పత్రికలు అసహాయులు, అబలలైన స్త్రీల గురించీ, వారు చేసే దుర్మార్గాల గురించీ చాలా ఎక్కువగా రాస్తున్నాయి. మీలో ఎవ్వరూ ఈ విపరీతాలన్నీ ఆపటానికి ముందుకు రావటం లేదేమిటి?

విధవలు పునర్వివాహం చేసుకోగూడదనే ఆచారం చూడండీ ఒక వ్యాధిలాగా అనేక ప్రాంతాలకీ కులాలకీ ఎలా వ్యాపించిందో! వందలూ వేలల్లో ఉండే విధవ స్త్రీలు అనుభవించేదుర్భరమైన వేదన ఊహించటం కూడా కష్టమే! దీని వలన ఎన్ని విపరీతాలు జరుగుతాయో! మనుష్యుల్ని ఇళ్ళలో బంధించీ వారి ఆలోచనలపై ఆధిపత్యం చలాయించీ మనం ఏనాడైనా స్త్రీ ధర్మాన్ని కాపాడుకోగలిగామా? స్త్రీలు వాళ్ళ మనస్సుల్లో, కళ్ళతో ఏమేం చేసేవారో అవన్నీ కూడా వాళ్ళని అంతే అపరాధులుగా చేస్తాయి కదా! స్త్రీల పునిస్త్రీ చిహ్నాలన్నీ చెరిపేయటం వలన, ఒక స్త్రీ తలగొరిగించీ ఇంకొక స్త్రీ బొట్టు తుడిచేసినంత మాత్రాన ఏం ఒరిగింది? ఆ స్త్రీలకూ లోపల అదే హృదయాలున్నాయి. మంచీ చెడుల గూర్చి అనేక ఆలోచనలున్నాయి. బాహ్య శరీరాన్ని నగ్నమైయ్యే వరకూ వలువలన్నీ వలిచేయచ్చు కానీ అంతఃరంగానికి ఎవరూ ఏం చెయ్యలేం కదా! అసలీ స్త్రీ ధర్మమంటే ఏమిటి? ఎల్లవేళలా భర్త ఆజ్ఞలను తూచా తప్పకుండా పాటించటం, అతను కోరిందల్లా చేయటం, అతను మిమ్మల్ని తన్నచ్చు, తిట్టచ్చు, వ్యభిచరించవచ్చు, తాగచ్చు, జూదమాడచ్చు, డబ్బులు పోగొట్టుకుని లబోదిబోమనచ్చు, దొంగతనం చెయ్యచ్చు, ఖూనీలు చెయ్యచ్చు, మోసాలు చెయ్యచ్చు, తోటి మనుష్యులపై అభాండాలు వెయ్యచ్చు, దోచుకోవచ్చు, మనుషుల్ని లంచాల కోసం పీడించవచ్చు. చెయ్యాల్సినవన్నీ చేసేసి అతను ఇంటికి వచ్చేసరికి స్త్రీ ధర్మం పాటించే ఆడవాళ్ళు ఎలా ఆలోచించాలో తెలుసా? "ఇంటి కిప్పుడెవరొస్తున్నారో నాస్వామి, చిన్న కృష్ణుడు గోపమ్మల దగ్గర పాలు పెరుగు దొంగిలించి, చంద్రావళి పై నెపం వేసి వస్తున్నాడు" అనుకుని చిరునవ్వుతో అతనికి స్వాగతం పలికి, భక్తితో అతనే పరమాత్మ అన్నట్టు సేవ చేయటానికి అతని కెదురుగా నిల్చోవాలి. కానీ ఒక్కసారి మనుష్యుల్లో మంచి చెడుల గూర్చి ఆలోచన రేకెత్తిన తరువాత వాళ్ళకి ఈ స్త్రీ ధర్మంపై నమ్మకం ఎలా ఉంటుంది? ఒక పురుషుడు మరో పురుషుడి భార్యతో లేచిపోవచ్చు. కాని అది ప్రాతివత్య ధర్మాన్ని వ్యతిరేకించటం కాదు. ఇంతకీ ఈ ధర్మాన్ని వ్యతిరేకించటానికి వేలాది కారణాలుండవచ్చు, మీరు మాత్రం మీ భర్తని దేవుడి లాగే పూజించాలి. కానీ ఈ రోజుల్లో మనస్ఫూర్తిగా అలా చేసే వాళ్ళెవరున్నారు. ఆనాటి సావిత్రి కథ మనకుండనే ఉంది, పతివ్రతా ధర్మం గురించి చాటి చెప్పటానికి. ఈ రోజుల్లో ఏ స్త్రీ అయినా అది తూచా తప్పకుండా పాటించగలదా? మరైతే అలాటివారిని ఒక్కరినైనా చూపించగలరా?

ఆ కథ ఏం చెప్తుందంటే మీ భర్త మిమ్మల్ని కాలితో తంతే మీరు తిరిగి చిరునవ్వుతో ఇలా "స్వామీ! ప్రభూ, అలా చెయ్యకండి, మీ పాదం నొచ్చుకుంటుంది," అని వెంటనే క్రింద కూర్చుని అతని పాదం వత్తటం మొదలు పెట్టమని. అతను పిడికిళ్ళతో గుద్దినా, కర్రతో కొట్టినా మీ కంట నీరు రాకూడదు. పైగా మీరు చిరునవ్వుతో లోపలికి వెళ్ళి తాజా వెన్న తీసుకు వచ్చి అతని చేతులకు మర్దన చేస్తూ "స్వామీ, ఆ దెబ్బలన్నిటి వలన మీ చేతులు మండుతున్నాయేమో!" అనాలి. మీ ఇంట్లో వెన్న లేకపోతే పొరుగింట్లోది

వాడాలి, అక్కడా లేకపోతే బజారుకి పరుగున వెళ్ళి వెన్న కొనుక్కు రావాలి. కానీ ఈ రోజుల్లో ఇవన్నీ ఎవరు చేస్తున్నారు? మరి నేటి మహిళ అలాటి భర్త చేతిని సవర దీయటానికి బదులు పొయ్యిలో పెట్టమని చెప్పచ్చు. అతనికి ఒక రకం వంటకం నచ్చకపోతే ఆమె కూడా అది తినకూడదు. కానీ నిజానికి జరిగేది దీనికి పూర్తిగా విరుద్ధం. అతను ప్రక్కకు నెట్టేసింది ఆమె కళ్ళ కద్దుకుని తీసుకుంటుంది. కాకపోతే అదేదైనా రుచికరమైన పదర్థామయి ఉండాలి. అలాకాక అది ఏ మామూలు కారట్టో, సొరకాయో అయితే ఆమెకూడా దాన్ని జీవితాంతం ముట్టుకోదు. భర్త ఇష్టపడంది అదే ఏ మామిడిపండో అయితే ఆవిడ కూడా వదిలేస్తుందా? అస్సలు వదలదు. భర్త మంచి నీళ్ళడిగేసరికి ఆమేమీ మెరిసే కంచు చెంబుతో నీళ్ళు పట్టుకుని ఎదురుగ్గా నించోవటం లేదు. ఆవిడేమంటుందో తెలుసా! "నేను కూడా ఇందాకటి నుండి దాహంతో చచ్చిపోతున్నాను. అక్కడే కుండలో నీళ్ళున్నాయి. మీరు కొంచెం తాగి నాక్కూడా కొంచెం ఇవ్వండి ఆ చేత్తోనే. నేనెం చెయ్యనూ, ఈ పసివాడు చెయ్యి దిగటం లేదు," అని.

భర్త 'స్నానం' అనే మాట అనగానే ఆమె ఎత్తు పీటవేసి, ఒక బకెట్ వేణ్ణీళ్ళు పెట్టి అతని కాళ్ళు రుద్దటానికి సిద్ధంగా నిల్చోవాలి. నిజానికి ఆమె ఎవరో ఒకర్ని కేకేస్తుంది. "అక్కడెవరైనా ఉన్నారా? ఒరేయ్ రామయ్యా! ఇలారా. ఆయన స్నానం చేస్తారట. నీళ్ళు తోడి, ఆయన పంచ మడతలు వేసి అక్కడ పెట్టు,' అని తన గురించి అడిగితే టీ తాగుతున్నాని చెప్పమంటుంది. ఆమె భర్త భోజనానికి రాగానే పీట వేసి, మంచినీళ్ళు పెట్టి, అతని కిష్టమైన వంటలతో భోజనం వడ్డించి, ఆ తరువాత ప్రక్కన కూర్చుని, కాలం వృధా చేస్తూ అతని భోజనం మయ్యేదాకా కబుర్లతో కాలక్షేపం చెయ్యాలి. కానీ ఈ రోజుల్లో అతను "అయ్యిందా లేదా? త్వరగా వడ్డించు తొమ్మిదవుతోంది" అంటుంటాడు. "ఆ వస్తున్నా, అయిపోయింది. కాస్త కూరపప్పు అయ్యే వరకైనా ఆగలేరా? ఉడికీ ఉడకని అన్నం వడ్డించమన్నారా? ప్రతి రోజూ ఇదే తొందర. ప్రతి రోజూ తొమ్మిదిగంటలకల్లా ఇదే వరస," అంటూ ఆమె సమాధానాలు చెప్తుంటుంది. ఆ తరువాత అతని తాంబూలం సంగతి. మళ్ళీ ఇద్దరూ అదే వరస. "కాస్త తాంబూలం కట్టిస్తావా," అని అతనడిగితే "ఆ గోడ గూట్లో తాంబూలం పెట్టి ఉంది. తాంబూలం సరిగ్గా ముడుచుకోవటం కూడా రాదు మీకు. అలా కాదు, ఇలా చేతిలో అన్ని వస్తువులూ వేసుకోవాలి," అని చెప్తుంది. చేసేది లేక ఆ మగమహరాజు తాంబూలం పెట్టె దగ్గరికెళ్ళి చూస్తే లోపల సున్నం ఉండదు. "చూడూ, ఇందులో సున్నం లేదు, కొంచెం తెచ్చిస్తావా," అని అడుగుతాడతడు. అందుకామె సమాధానం మాత్రం "ఇంకో పెట్టిలో చిన్న సంచితో వక్కపొడుంది చూడండీ. మీరు అది తాంబూలంలో వేసుకుని నాక్కూడా కొంచెం తెచ్చివ్వండి. భోంచెయ్యగానే నోరంతా ఎలాగో ఉంటుంది," అని చెప్తుంది. ఇది రోజూ మనం చూసే జీవితాలకి దగ్గరగా లేదూ!

పతివ్రత అంటే ఈ రోజుల్లో అర్థం ఇదే మరీ! మొదటి నుండీ చివరి దాకా ఈ కథంతా మీకు చెప్పాలంటే పూర్తిగా ఇంకో పుస్తకమే రాయాల్సుంటుంది. అసలు శాస్త్రాలన్నీ మానవ మాత్రులెవరు పూర్తిగా ఆచరించగలరు? ఇంకొకరు ఆచరించాలని ఆశించగలరు? ఒక భర్త తన భార్యకు నిజంగా దైవ సమానుడవ్వాలంటే అతను దైవంలాగే ప్రవర్తించనక్కరలేదా? భార్యలు భర్తల్ని దేవుళ్ళలాగా పూజించాలి అనుకుంటే, భర్తలకి తమ భార్యల పట్ల నిజమైన అనురాగం ఉండి వాళ్ళ కష్టాల్లో సుఖాల్లో దేవుడిలాగే స్పందించక్కరలేదా! దేవుళ్ళకి వాళ్ళ భక్తుల్ని చూస్తే, సంతోషమూ, సంతృప్తీ! మరి భర్తలు కూడా అలాగే ఉండాలి కదా! మరి భర్తలు తమను పూజించే స్త్రీలలో సుగుణాలూ, లోపాలూ చూసినపుడు, అవి గమనించి లోపాలను ప్రేమతో సరిదిద్దటానికి ప్రయత్నించక్కర లేదా! భర్త ఎంత నీచుడైనా దేవుడిలాగా ఏ స్త్రీ అతన్ని చూడగలదు? పాండవుల పినతండ్రి ధృతరాష్ట్రుడు గుడ్డి వాడైనందుకు అతని భార్య గాంధారి పెళ్ళి అవగానే కళ్ళకు గంతలు కట్టేసుకుంది. కాని ఎంతమందికి కళ్ళుండీ చూడద్దని చెబితే, గుడ్డివారిలా

నడుచుకోవాల్సి వస్తే భరించే శక్తి ఉంటుంది? ఎంతమంది కంత ఇంద్రియ నిగ్రహం ఉంటుందీ? నాకు తెలిసీ అలాంటి వాళ్ళు ఎవ్వరూ లేరు. పెద్ద పెద్ద మాటలందరూ శాస్త్రాలు చదివే మాట్లాడతారు శాస్త్రాలూ, పురాణాలు, పోతీలు మొదలైన పుస్తకాలు రాసిన వాళ్ళందరూ నిజానికి సిగ్గు పడాలి. ఎదుకనడగండీ? పూర్వకాలంలో కొంతమంది స్త్రీల గురించి వాళ్ళు రాసినప్పుడు, అప్పట్లో ఆ స్త్రీలు కొన్ని తప్పులు చేసినా, ఈ రోజుల్లో గొప్ప పతివ్రతలు గానే భావించపడుతున్నారు. అది మరి మంచిపనేనా? ద్రౌపదినే చూడండీ! అప్పటికే అయిదుగురు భర్తలున్న ఆమె కర్ణ మహారాజుని రహస్యంగా కామించటం మాననే లేదు కదా! అహల్య సురేంద్రుడి వడిలో కూర్చుని, ముందు రాయిగా మారి తరువాత దేవతై పోయింది. సత్యవతీ, కుంతీ కన్యలే కదా! కానీ వారిద్దరూ వేదాల రచయిత వ్యాసుణ్ణి, కర్ణుణ్ణి కన్న తరువాత కూడా పతివ్రతల క్రిందే పరిగణించబడ్డారు కదా! ఒకామె తన శరీరం నుండి దుర్గంధం పోగొట్టిన మునిని నమ్మేసింది. రెండో ఆమె ఆ మంత్రం శక్తేమిటో చూద్దామని ప్రయత్నించింది. మీ దేవుళ్ళు, మునులూ అందరూ అద్భుతమైన వ్యక్తులు కారా? ఒకరిని మించిన వారొకరు. ఒక్కొక్కరూ ఒక్కో రహస్యపు పెళ్ళి చేసేసుకోవటం, ఆ తరువాత వెళ్ళి శాంతనుడు, పాండురాజులను తగులుకోవటం, మరి వాళ్ళు చేసుకున్నది రెండో పెళ్ళికాక మరేమిటి? ఆ తరువాత వాళ్ళ సుపుత్రులు వ్యాసుడూ, పెద్ద మనసు గల కర్ణుడూ ఎంత పవిత్రులైపోయారంటే దేవుళ్ళే వచ్చేసి వాళ్ళ కాళ్ళమీద పడిపోయారు. ఈ రోజుల్లో ఎవరికైనా అలా సంతానం కలిగితే వాళ్ళని ఇంకోరకం పేర్లతో పిలుస్తారు కదా! ఒక బానిస స్త్రీ బిడ్డని ఒకరకమైన లంజ కొడుకుగానూ, ఒక బ్రాహ్మణ విధవ కొడుకుని వేరే పేరుతోనూ పిలుస్తారు. మళ్ళీ విదురుడిలాంటి వాళ్ళు వేరు. కొంతమంది దృష్టిలో అటు వంటి పిల్లలు దండగమారి ఖర్చు లెక్కల్లోకి వస్తారు. మరైతే ఇప్పుడు చెప్పండి పెళ్ళి కాని స్త్రీ కన్నబిడ్డను ఏమని పిలువాలో? వ్యాసుడు లాంటి వాడు శాస్త్రాలూ, పురాణాలలో గొప్ప నిష్ణాతుడై మహాభారతం లాంటి గ్రంథాలు రాస్తాడు. ఇంక అతని తల్లితండ్రీ పవిత్రులైపోయినట్లేనా? ఇకపోతే కర్ణుడి తల్లి అతడు కురుక్షేత్ర యుద్ధంలో పాండవులతో యుద్ధం చేసినప్పుడు తిరిగి మహాశీలవతైపోయిందనుకుంటాను.

ఇప్పుడు వానరుడు వాలి భార్య తార కథకి వద్దాం! సుగ్రీవుడు వాలి తమ్ముడే కానీ వాలి అతడి భార్య రుమని ఎత్తుకుపోతూ ఆనల్లకోతి సుగ్రీవుడు తోక ముడుచుకు పారిపోయేలా తరిమేడు. తరువాత సుగ్రీవుడు సాక్షాత్తూ రామచంద్ర ప్రభువుని కలుసుకున్నప్పుడు వారికి తామిద్దరూ ఒకే స్థితిలో ఉన్నట్టు అర్థమైపోయింది. రామచంద్రుడి భార్యని రావణుడెత్తి కెళితే సుగ్రీవుడి భార్యను అతని అన్నే ఎత్తుకుపోయాడు. ఇంకేం ఇద్దరూ కలిసిపోయారు చక్కగా. రామచంద్రుడు సుగ్రీవుడిపై జాలిపడి, వాలిని మాయాజాలంతో ఓడించేసి సుగ్రీవుడు తారను పెళ్ళాడే ఏర్పాటు కూడా చేసేశాడు. పాపం తార రామచంద్రుడితో మొరపెట్టుకుంది. "మహారాజా! నీవిలాంటి పని చేయదగునా? భర్త తమ్ముడు సొంతబిడ్డతో సమానం కదా! ఇదంతా నాకు తప్పుగా తోస్తుంది." అని వెంటనే రామచంద్రుడామె కభయం ఇచ్చేశాడు." దీని గురించేమీ నువ్వు బాధపడకు. నీ భర్త తమ్ముణ్ణైనా సరే నీవు నిశ్చింతగా రెండో పెళ్ళి చేసుకోవచ్చు. నీ పేరు ప్రతివ్రతల్లో స్థిరంగా ఉంటుంది." ఇదంతా జరిగిపోయింది సరే! శ్రీధరస్వామి[3] దేవుళ్ళకైతే ఏం చేసినా చెల్లుతుందని ఇంకో నాలుగు పంక్తులు అదనంగా రాసేశాడు. అంటే మానవ మాత్రులు అలాంటివి చెయ్యచ్చని కాదు గదా! కాని మనుష్యులు దేవుళ్ళని చూసి అలాగే చేస్తారనీ వాళ్ళని చూసి నేర్చుకోవాలి అనుకుంటారనేది స్వామికి తెలియని విషయమా? అలా కాకింకెలా చేస్తారు? ఇక స్వామి సంగతి కొస్తే ఆయన సుగ్రీవుడి పట్టాభిషేకం చూడటానికి వచ్చిన జనాన్ని, అక్కడి గందరగోళాన్నీ, ఆడంబరాల్నీ వర్ణిస్తూ తన్ను తాను మర్చిపోయాడు. అదే జరిగి ఉండకుండా ఉంటే మానవ మాత్రుల్లో దైవభీతి కలిగించటానికి ఆయన ఇంకా ఇంకా పద్యాలు రాసేసేవాడు.

ఇకపోతే రావణుడు సీతాదేవిని ఎత్తుకెళ్ళగానే తన తప్పు తాను తెలుసుకున్నాడు. అతడు నిజంగానే ఆమె వ్యామోహంలో పడిపోయాడు నిట్టూర్పులు, దుఃఖం వగైరాలతో సహా! అయితే వ్యవహారమంతా ఈ రోజుల్లో పద్ధతులుంటే చాలా సులభంగా పరిష్కారమైపోయి ఉండేది. రావణుడు రాముడి చేతుల్లో పెళ్ళి ఖర్చుల నిమిత్తం కొన్ని వందల వేల రూపాయలు పోసేసేవాడు. ఎవరిచేతా ఆడదాని కోసం రాజ్యమే పోగొట్టుకున్నాడనిపించుకోకుండా అతని జీవితం అతడు కులాసాగా గడిపేసేవాడు. కాని పాపం అతనేం చెయ్యగలడు? బ్రహ్మ దేవుడేమో అతన్ని శపించినాడయ్యే! ఏ పరపురుషుడి భార్యపైనైనా బలవంతంగా చెయ్యి వేసావంటే నీ శరీరం వంద చెక్కలై పోతుందంటూ!" ఆ శాపం మూలాన భయపడిపోయి రణక్షేత్రంలో చావటమే మేలనుకున్నాడు. లేకుంటే పది పెళ్ళిళ్ళకు సరిపడా డబ్బు ధారపోసి సీత మళ్ళీ అయోధ్య ముఖం చూడకుండా జాగ్రత్త పడేవాడు. అతడు తన శక్తివంచన లేకుండా అన్ని ప్రయత్నాలూ చేసాడు కానీ నాశనమైపోయాడు. అంతేకాదండోయ్. మీకు ఇంకో ప్రతివ్రత దృష్టాంతం కూడా చెబుతాను. అదేమిటా? రావణుడు తన భార్య మండోదరి దగ్గరకెళ్ళి "నువ్వు గొప్ప పతివ్రతవు కదా! సీత దగ్గరకెళ్ళి నువ్వామెకు సోదరిలాంటి దానివని సహభార్యవని నమ్మించు," అని చెప్పాడు. ఆ రోజుల్లో భర్త ఆజ్ఞలను, భార్యలు చాలా గౌరవించేవారు. భర్త ఆజ్ఞననుసరించి మీరు. ఇంకొకరి భార్యకు అబద్ధాలు చెప్పినా, ఆమెను మీ భర్త కోసం తీసుకు వచ్చినా, అదే మీ భర్త అభీష్టమైతే అందులో ఏ తప్పు లేదు. మండోదరి కల్తీలేని స్వచ్ఛమైన పతివ్రతా ధర్మమంటే అదేననుకొంది. ఇంకేం, ఆమె సీతను చూడటానికి గొప్ప సలహాలతో సహా బయలుదేరి వెళ్ళింది. "చూడూ, రాముడూ రావణుడూ ఒకే రాశిలో జన్మించినవారు. వారి పేర్లలో మొదటి అక్షరం 'రా' కూడా ఒకటే. ఒక్కసారి రాక్షసరాజు రావణాసురుణ్ణి తిలకించు. అతని సాహసకృత్యాలు, అతని ఐశ్వర్యం, వైభవం, అతని గొప్ప రాజ్యం. మరి నీకు అయోధ్యకు వెనక్కి వెళితే దొరికేదేమిటి? అడవిలో జీవితం, ఇల్లు లేదు, రాజ్యము లేదు, అవమానం తప్ప దొరికే దేమి లేదు." ఆమె సీతపై ఈ సలహా ల వర్షం కురిపించినా, ఆ మహారాణి ఈమె మాటలేమీ విన్పించుకోలేదు. సీత అంతకు ముందే ఈ కథకు రెండోవైపు గురించి వినే ఉంది. బలిరాజు ఇంట్లో దాసి ఒకామె మన నాయకుణ్ణి అంగదుడి ఉయ్యాలకు తలక్రిందులుగా వేసి కట్టేసి ఎలా అవమానపరిచిందో, ఆ వేళ ఈయన పసిబిడ్డ మూత్రం తాగటం మినహా మరేమీ చెయ్యలేని స్థితిలో ఎలా ఉండిపోయాడో విని ఉంది. ఇంకేం సీత మండోదరికి సమాధానంగా కొన్ని కఠోర సత్యాలు విన్పించి పంపించేసింది. అది ఆనాడు జరిగిన సంఘటన కథ. ఇంక మండోదరి విషయానికి వస్తే భర్త ఇష్టానికనుగుణంగా వేరొకరి భార్యను మోసపుచ్చటానికి ప్రయత్నించటం, తన భర్త సౌఖ్యం కోసం ఆమె నప్పగించటానికి యత్నం, ఇవన్నీ పతివ్రతగా ఆమె పతి పూజలో భాగమే. ఏమీ తప్పులేదు. పైగా మండోదరి లాంటి పతివ్రతను పురాణాలన్నీ గొప్పగానే స్తుతించాయి. కనుక నిజంగా ఈ కథలో రెండురకాల నీతులున్నాయి. భర్త తన భార్య తన సౌఖ్యం కోసమే ప్రయత్నించి ఆమె ధర్మము నిలబెట్టుకుందని సంతోషిస్తే, భార్య తాను సక్రమమైన పనే చేసానని సంతోషిస్తుంది. ఇందులో మూడో వ్యక్తే గదా దీనంతటి మూలంగా వలలోపడిపోయేదీ. మొదటి ఇద్దరికీ ఆమె గురించి లెక్కేలేదు. దేవతలందర్నీ అభినందించాల్సిందే! మరి మీ పతివ్రతలకు మరిన్ని జేజేలు.

నిజానికి ఇలాంటి విషయాల్లో కొంత పాప భారం దేవుళ్ళపైనే వెయ్యాలని మనము ఆలోచించనక్కరలేదా? అసలు దీనంతటిలో నిజమైన సత్యమేమిటి? పోనీలెండి అసలు సత్యాన్ని అలాగే ఉండనివ్వండి - మన శాస్త్రాలేమి చెప్తున్నాయంటే యుద్ధభూమిలో తండ్రో, తమ్ముడో ఎదురొస్తే చంపటానికి సందేహించకూడదు అని. లక్ష్మణుడు ఇంద్రజిత్తుని దెబ్బతీయటం చూసి రామచంద్రుడు "సోదరా! లక్ష్మణా! నువ్వేం చేస్తున్నావు? ఈ శూర ధర్మం ఎంత కఠినమైంది, భారమైందీ? అందరిపైనా, ఒక అల్లుడో కొడుకో పైన కూడ, అభిమానం చంపుకోమటుంది," అని బాధగా అన్నాడు. ఆ సమయంలో సులోచన పాతివ్రత్యం, భక్తీ చూసి రాముడు ఇంద్రజిత్తుని మళ్ళీ ప్రాణం ఇచ్చి బ్రతికించి ఉండాల్సింది.

కాకపోతే రాముడు మారుతి, విభీషణుల చెప్పుడు మాటలు విని ఆ మాణిక్యం లాంటి స్త్రీ మంటల్లో పడి దగ్ధమై పోతుంటే చూస్తూ ఊరుకొన్నాడు. ఏమైనా ఇలాంటి సత్యాలు నా కళ్ళెదుటే కనబడుతుంటే మీకు గుర్తు చెయ్యక తప్పటం లేదు. ఒకవేళ ఒకరిద్దరు దేవుళ్ళనునేను తప్పు పట్టి వుంటే నేను వాళ్ళని నన్ను క్షమించమని ప్రార్థిస్తాను. వాళ్ళు నన్ను క్షమించవచ్చు, క్షమించకపోవచ్చు. ఏమైనా వాళ్ళు దేవుళ్ళగానే కొనసాగుతారు కదా! ఇకపోతే ఈ రోజుల్లో మునుల సంగతేమిటి? ఒకాయన లేడికి పుట్టాడు. ఆయన శృంగరుషి, ఇంకో ఆయన పక్షికి పుట్టాడు భరద్వాజుడు, గాడిదకు పుట్టినవాడు గార్ధభరుషి, గోవుకి పుట్టినవాడు వృషభరుషి. వాళ్ళెవరూ ఇప్పుడు లేరు కానీ వాళ్ళకి జన్మనిచ్చిన స్త్రీలకు మాత్రం ఆ పేరు మిగిలిపోయింది. వీటన్నిటికీ విమోచన ఎప్పుడు, పరిష్కారం ఎప్పుడు?

ఔను, నిజమే. మీకు సింహానికున్నంత ధైర్యం ఉంది; భగీరధునంత శ్రమ చేయగలరు. జామినికున్నంత వివేకముంది. మీరెంతో ధైర్యవంతులు, భయమెరుగని నాయకులూ, అపజయమెరగని శూరులైన శత్రువుల్ని ఓడించి వారిని ఒట్టి గొఱ్ఱె పిల్లల్ని వదలేసినంత తేలికగా వదిలేసే వీరులు గొప్ప అరివీర భయంకరుడైన అగ్నిలాంటి దేవుణ్ణి పట్టుకుని అతన్ని యంత్రాల ద్వారా మీకు కావాల్సిన పనులన్నీ చేయించారు. వాయుదేవుడు అగ్ని కంటే బలవంతుడు. అగ్నిని మీరుకంటితో చూడవచ్చూ, ఒక్కోసారి చేత్తోనూ పట్టుకోవచ్చు. కాని వాయువుని కంటితోనూ చూడలేం, చేత్తోనూ పట్టుకోలేం. కానీ పురుషులు మీ శక్తి నుపయోగించి అతన్ని కూడా మీ అధీనంలోకి తెచ్చుకున్నారు. మెరుపు అన్నిటికీ తల్లిలాంటిది, ఎక్కడో ఎంతో ఎత్తులో అనంతాకాశంలో పక్షులు కూడా ఎగరని చోట మబ్బుల మధ్యలో ఉంటుంది. మీరు ఆమెను కూడా క్రిందికి లాగి, మీ కోసం ఆమె ఒక బానిస స్త్రీ లాగా కష్టపడేట్లు చేశారు. మీరింత బలవంతులైన నాయకులైనపుడు, పాపం ఏ దారి లేని విధవ స్త్రీలను ఈ అవమానాల గుండం నుండీ బయటకు లాగటం మీకు అంత అసాధ్యమా? ఈ కులరీతులను కొన్నిటిని అధిగమించి, వాళ్ళ నుదుళ్ళపై మళ్ళీ కుంకుమదిద్ది, మళ్ళీ వాళ్ళు వివాహ జీవితపు ఆనందాన్ని అనుభవించేట్లు చెయ్యలేరా?

ఓ, మీ గొప్పదనం, మీ ధైర్యం మీ ఇంటి బయటెప్పుడూ పని చెయ్యదేమో! ఇదెలా ఉందంటే ఒక ముసలి గుడ్డి తల్లి మధ్యలో కూర్చుంటే అయిదారుగురు చిన్నపిల్లలు ఆమె చుట్టూ ఆడుకుంటూ ఒకడు "నాకు రాజవ్వాలని" ఉందంటే రెండోవాడు "అమ్మా నేను మంత్రి" నంటే మూడోవాడు "నేను సైన్యాధిపతిని, ఇప్పుడు మనం రాజ్యాన్ని స్థాపిద్దాం, ఇది సైన్యం, ఇది రాజుగారి దివాణం" అన్నట్టుంది. ఇదే విధంగా ఎండమావుల్లో వరదల్లా మీరందరూ నడుచుకుంటూ ఉంటారు. మీలో ఒక్కరు కూడా నిజమైన నాయకుడిలా సవాలు స్వీకరించలేదు. యూసఫ్ కథల్లో చిట్టెలుకల సమూహంలాంటి వారు మీరు. పిల్లి మెడలో మనమంతా తప్పక గంట కట్టాలి అనుకుంటారు మీరు. అలాగే మీ నోట్లో సంస్కరణల గురించి మాటలు ఎప్పుడూ వినబడుతూ ఉంటాయి. కానీ వాటిని ఆచరణలో పెట్టేవాళ్ళు ఎవరు? మీరు గొప్ప గొప్ప సభ లేర్పాటు చేసి, వింత వింత శాలువాలు కప్పుకుని, పువ్వులు కుట్టిన తలపాగాలు పెట్టుకుని, మణుగుల కొద్దీ ఒక్క పొడీ, బళ్ళ కొలదీ తమలపాకూ ఖర్చు పెడుతూ, రకరకాల దండలు అందిస్తూ, ఒక కొలను పన్నీరు ఉపయోగించేసి చక్కగా ఇంటికి వచ్చేస్తారు అంతే! అదే మీరు చెయ్యగలిగేది. ఈ నకిలీ సంస్కరణ సంఘాలు మన మధ్య ముప్పై ముప్పై ఐదు సంవత్సరాల నుండీ ఉన్నాయి. కానీ వాటి వలన ఉపయోగం ఏమిటి? మీరంతా ఒక్కళ్ళ భుజాలొక్కళ్ళు చరచుకుంటూ ఆనందపడుతున్నారేమో! కాని పరికించి చూస్తే వాటి ప్రయోజనం మీ ఒక మేకకున్న అరవ చన్నంత కూడా లేదు.

ఈ విషయం చూడండీ. ప్రపంచంలో అన్నిటినీ శాసించే దేవుడు తన తెలివి తేటలన్నీ ఉపయోగించి ఈ ప్రపంచాన్ని అద్భుతమైన వస్తువులతో నింపేశాడు. కానీ రెండే వస్తువులు - ఐశ్వర్యం, స్త్రీలు అందరి మనస్సులనీ బలంగా ఆకర్షిస్తాయి. ఇందులో కూడా స్త్రీలే మరింత ఆకర్షణ శక్తి గలవాళ్ళు.

వాళ్ళు మీ జీవితాల్ని ఏ ధనమూ చేయలేనంతగా సౌఖ్యంతో నింపుతారు. ఒక్కసారి ఊహించుకోండి! మీరొక అద్భుతమైన రాజభవనం నిర్మించి అన్ని రకాల హంగుల మధ్య, చుట్టూ అందమైన తోటలతో, అనేక రకాలైన విలువైన వింతైన వస్తువులతో, రథాలతో, గుఱ్ఱాలు, పల్లకీలతో, ఏనుగులతో, ఒంటెలతో, సైనికులతో, అనేకమంది సేవకులు మీ చుట్టూ ఉండి, రాజవైభవంతో మీరు బ్రతకచ్చు. అయితే అవన్నీ స్త్రీలను వదిలేసి మీ కోసమే ఏర్పాటు చేసుకోగలరా? అలా చేస్తే మీ రాజ మందిరమే ఒక మండిపోయే మైదానమవుతుంది, మీ హంస తూలికా తల్పం, సుతిమెత్తని దిళ్ళూ తగలబడే కాష్ఠమవుతాయి. మీ చుట్టూ ఉండే సైనికులూ, వంది మాగధులూ, సేవకులూ స్నేహితులు కాక శత్రువులవుతారు. మీరు తినే మధురమైన పిండి వంటలన్నీ మీ నోట్లో నిమ్మకాయ తోలు లాగా చేదుగా మారిపోయి, మీరు కట్టుకునే మెత్తని బట్టలూ, ధరించే ఆభరణాలూ మీ ఒంటినే చుట్టుకున్న పాములని పిస్తాయి. ఇవన్నీ కలసి మీకు పిచ్చెక్కేట్లు చేస్తాయి. దేవుడే దిగివచ్చి మీ ముందు నిలబడ్డా, మీరు ఆ క్షణంలో ఆయన్ని సందేహం లేకుండా వెనక్కి పంపించేస్తారు. ఒక్కసారి మీరెలాంటి అనుభూతులకు గురవుతారో ఆలోచించి, ఆ తరువాత మరి పురుషుడు లేకుండా స్త్రీ ఆనందంగా బతకగలదా అని ప్రశ్నించుకోండి. మీరెలాంటి స్థితిలో ఉంటారో ఆమె కూడా సరిగ్గా అలాంటి స్థితిలోనే ఉంటుంది. ఆమెన్ని ఐశ్వర్యాల మధ్య బ్రతికినా, మొత్తం ప్రపంచమే మీరు ఆమె చేతికందించినా, ఏకాకి అయితే ఆమె పరిస్థితి మీరు ఒక్కసారి ఊహించుకోండి. ఇద్దరు మనుష్యులు జతగా జీవించాలనేది అసలు దేవుడి ఆలోచనే! దేవుడు తను సృష్టించిన ప్రతి దానిలోనూ పక్షుల నుండి మొక్కలూ, వృక్షాల వరకూ ఆడజాతిని నిర్మించాడు. ఏ జాతిలోనూ దాని జతలేనిదే సొగసు కానీ, అందంగానీ లేదు. ఏ పనీ కూడా ఇద్దరు కలసి చెయ్యందే పూర్తవదు. ఈ ప్రపంచమనే కీకారణ్యంలో మీ అంతట మీరు దారి వెతుక్కోగలరా? ఈ భౌతిక జీవితాన్ని మీ అంతట మీరు సంబాళించుకోగలరా? ఆ గొప్ప పొలంలో ఒక నాగలి మీరు ఒక్కరే లాగుతూ, ఒక సన్యాసిలా స్త్రీ ముఖం చూడకుండా కనీసం ఒక నెలా రెండు నెలలైనా జీవించగలరా? మీ ప్రక్కన ఒక స్త్రీ మూర్తే గనుక లేకపోతే మీ సొంత తండ్రో లేక బాబాయో కూడా ఒక జంట ప్రక్కన మిమ్మల్ని నించో బెట్టటానికి సందేహిస్తారు. ఎవరో ఒంటరిగా తనంతట తాను బ్రతికే ఒక మగవాడి గురించి ఎవరూ పట్టించుకోరు.

పెళ్ళాం బిడ్డలున్న మగవాడికి తన దురలవాట్ల వల్లో, మంచితనం వల్లో కష్టాలొచ్చినా, అతను గొప్పవారి ఆశ్రయం కోల్పోయినా, ఒడ్డీ వ్యాపారుల వల్లో పడినా జనాలు "అయ్యో, పాపం! అతని బిడ్డల గురించి ఆలోచించండీ!" అంటారు. అసలు అతని గురించి ఎవరికీ లెక్కే ఉండదు. అతని భార్యా బిడ్డల గురించే జనం అతన్ని జాలి దలచి వదిలేస్తారు. అగస్త్యుడు కూడా సీతలేని రాముణ్ణి దర్శనం చేసుకోవటానికి నిరాకరించాడు. రావణుడు సీతనెత్తుకెళ్ళి పోయినప్పుడు రాముడి శక్తినంతా తీసుకెళ్ళిపోయాడు. ఆ తరువాత రాముడు చేయగలిగింది అడవుల్లో గమ్యం లేకుండా తిరుగుతూ జాలి గొలిపేలా "ఓ నా ప్రియసఖీ, జనకపుత్రీ, సుగుణాల గనీ, ఓ సీతా సీతా!" అని విలపించటమే! స్త్రీలకు అంత జయించే శక్తి ఉందిమరి. మీరొక బలమైన శత్రువుని గొప్ప సైన్యాలతో, తుపాకులతో, మారణాయుధాలతో దాడి చెయ్యచ్చు, అతన్ని గొలుసులతో బంధించి బానిసగా చేసుకోవచ్చు. ఎంతోమంది బలమైన రాజులు మీ చుట్టూ ఒరిగిపోవచ్చు. రక్తం పొంగిన ఏరులా పారింతరువాత చివరకు విజయం మిమ్మల్నే వరించవచ్చు. మీరు పులిని పట్టుకుని ఒక బోనులో వెయ్యచ్చు, భీకరమైన ఒక సింహాన్ని లొంగదీసి కళ్ళెం వేసి దాన్ని గుఱ్ఱంలా సవారి చెయ్యచ్చు. కానీ మీ ధైర్య సాహసాలు, ధీరత్వం అన్నీ ఒక అబల ముందు, ఆమె కళ్ళల్లో చురుక్కుమనే చూపు ముందూ ముడుచుకుపోతాయి. మీరామె కాళ్ళ ముందు కుక్కలా నాకుతూ పడిపోతారు. ఏ మూఢుడైనా కత్తి తీసుకుని ఎవర్నైనా గాయపరచవచ్చు. అందులో ధీరత్వమేముంది. కాని ఎంతో దూరం నుండి ఒక కంట చూపు చూసి మనుష్యులని 'ఆ', 'ఊ' అంటూ నిట్టూర్పులు విడిచేలా చేయటం వేరు. ఇందులో ఇప్పుడెవరెక్కువ శక్తి వంతులూ? మీరా? స్త్రీలా?

మీ తల్లి విషయం కూడా అంతే! ఆమె తన్ను తాను కంటే మిమ్మల్నే ఎక్కువ ప్రేమిస్తుంది. మిమ్మల్ని కష్టంలో ఉన్నప్పుడు మీరు పసిపిల్లలుగా ఉన్నప్పటి కంటే ఎక్కువగా కనిపెట్టుకుని ఉంటుంది. మెరుపు కంటే వేగంగా మీ పిలుపుకి పలుకుతుంది, మీ గౌరవానికి సమాజంలో ఏ మాత్రం భంగం కలుగకుండా శ్రద్ధ తీసుకుంటుంది, మీరు తలెత్తి చూసేసరికి ఆమె మీ సేవ చేయటానికి ఎదురుగా నిల్చుంటుంది. ఒక ఆత్మీయుడైన రుషిలాగా మీ కష్టాల్లో సుఖాల్లో చివరి వరకు చిరునవ్వుతో భారం మోస్తుంది. అసలు సంగతేమిటంటే, మీ సంతోషాన్ని నిరంతరం ఎవరు కోరుకుంటారో ఆమెపైనే మీరీ నిందలన్నీ వేసి, పాతాళానికి తొక్కెయ్యాలని చూస్తున్నారు. మీకు సిగ్గు వెయ్యటం లేదా? ఓరి మూర్ఖుల్లారా! స్త్రీలు సహజంగా సున్నితమైన వారు, బిడియస్తులు, కొంత అమాయకులు. మరి మీరో ఎటువంటి దొరలండీ స్వాభావికంగా చొరవగలవారు, ధైర్యవంతులు, విద్యావంతులు- కనుకే మీ పెదవులు మీ తల్లి బంగారు వక్షాల నుండీ అమృతమైనా స్పృశించకముందే మీరుస్త్రీలను ఈ రకాలైన మాటలన్నీ అంటున్నారు. మీరు బలవంతులైనంత మాత్రాన అది మంచిపనై పోతుందా! మీరు ఆడవాళ్ళకి అనేక రకాలైన అవమానకరమైన పేర్లు పెట్టి, వాళ్ళు బలహీనులనీ, బుద్ధి హీనులనీ, అతిచొరవ గలవారనీ, ఆలోచన లేనివారనీ పిలిచేసి వాళ్ళ పేర్లలో శబ్దాలనే అవమానపూరితం చేసేస్తారు. వాళ్ళని నిరంతరం ఇళ్ళనే బంది ఖానాల్లో మూసేసి మీరు మీ అధికారం, గొప్పతనం పెంచుకుంటూ "అయ్యలూ" "దొరలూ" వగైరా అయిపోతూ ఉంటారు. అసలు మీలో మీరు ఒక్కసారి ఈ "భార్య" అనేది ఏం పదార్థం అని ఆలోచించుకోండి. "చేతిలో కుందేలు ఉన్నవాడే వేటకాడు, మిగిలిందంతా హుళక్కే" అన్నట్టు పసితనం నుండి వారి హక్కులన్నీ మీ చేతిలో పెట్టుకుని, స్త్రీలను నిజమైన ప్రపంచానికి దూరంగా చీకటి మూలల్లోకి తోసివేసి, పరదాలో మూసివేసి భయపెట్టి, వత్తిడి పెట్టి ఆడబానిసల్లాగా అణచివేస్తారు. ఈలోగా మీ గొప్ప గొప్ప గుణాలతో మాకళ్ళు చెదిరేలా చేస్తున్నారు. విద్య స్త్రీల కోసం కాదు, ఎప్పుడంటే అప్పుడు ఇంటికి వచ్చి బయటకు వెళ్ళటం కూడా స్త్రీలు చెయ్యకూడదు. ఒకవేళ ఏ స్త్రీ అయినా ఇంటి బయటకు వచ్చి వేరే స్త్రీలను కలుసుకున్నా ఆ స్త్రీలు కూడా ఏమీ తెలియని వాళ్ళే, వాళ్ళందరిదీ ఒకే తీరు. ఇంక ఆమెకి ఒక జ్ఞానం గానీ, తెలివి తేటలు గానీ ఎలా వస్తాయి?

మీ పూర్వీకులెవరైనా భార్య భర్తకు ముందు కానీ, భర్త తన భార్యకు ముందు కానీ చనిపోవటమే మంచిదని దేవుడి నుండి నేరుగా సాక్ష్యం చూపగలరా? ఎవరు చావాలో ఎవరు బతకాలో అనేది అతిశక్తివంతుడైన నారాయణుడి చేతిలోనే ఉంది. ఆయన పేరు వాడుకుని రాళ్ళు వేయటం తప్ప మీ చేతిలో ఏముందీ? యువతీ యువకులు చచ్చిపోవటం ముసలివాళ్ళు బ్రతకటం గురించి ఏదైనా చట్టం ఉందా? కొంత మంది పుట్టగానే, కొంతమంది సంపూర్ణ యవ్వనంలో, మరికొంతమంది జీవితంలో అనుభవించాల్సిందంతా అనుభవించాక పండు ముసలితనంలో చనిపోతారనేది సత్యం కాదా? ఇంకొంతమంది జీవితంలో ఆనందమంతా జుర్రుకునే సమయంలో వెళ్ళిపోతారెందుకు? యముడి పిలుపు రాగానే గొప్ప గొప్ప రాజ్యాలనీ, ఆభారం మొయ్యటం ఆనందంగా ఉన్నా సరే బరువుగా ఉన్నా సరే, వదిలేసి రాజులు ఒక్కనిముషం ఆగకుండా భార్యా బిడ్డలని వెనక వదిలేసి వెళ్ళిపోతారెందుకు? కొంతమంది సంతోషంగా, మరి కొంతమంది విచారంగా, అయిష్టంగా! ఈ విషయంలో మార్పుచేగలిగిన వాళ్ళెవరైనా ఉన్నారని మీరనుకుంటున్నారా? యమదూత ముందు గొప్ప మహరాజే ఏమీ చెయ్యలేడు. కనుక ఒక మామూలు స్త్రీ మాటెవరు విన్పించుకుంటారు? ఆమే! ఆమె భగవంతుడు మాత్రమే నీరుపోసి పెంచే తోట. ఈ విషయంలో ఆమేమి చెయ్యగలదు? ఇంక మీ మహాభారతాని కొస్తే అందులో ఎక్కడైనా ఒక స్త్రీ బ్రహ్మదేవుణ్ణి తన చనిపోయిన భర్తను తిరిగివ్వమనటం మీకు కన్పిస్తుందా? అదీ భగవంతుడూ, సృష్టికర్తా తానే స్వయంగా, "ఏ స్త్రీ కూడా, ఆమె ఎవరైనా సరే, ఒక్కసారి భర్త పోయిన తరువాత రెండవసారి వివాహం చేసుకోకూడదని" చెప్పింతరువాత. సావిత్రి తప్ప మరే స్త్రీ యముడి దగ్గర నుండి పోయిన తన భార్య స్థానం

తిరిగి పొందలేకపోయింది. ఆమె వెళ్ళింది సరే, భర్తను తిరిగి పొందిందీ, ఆపైన చాలా వరాలు కూడా యముడి దగ్గర నుండీ పొందిందీ. సావిత్రి ఒక అబలే అయినా యముడి రాజస్థానానికి వెళ్ళి తన భర్తను తిరిగి తెచ్చుకోగలిగింది సరే! మరే పురుషుడైన భార్యను బ్రతికించుకునే ఉద్దేశంతో యముడి దగ్గరకు బయలుదేరిన సంగతి విన్నారా; నిజంగా ఆమెను బ్రతికించుకునే సంగతి వదిలేయండి. ఒక్కసారి స్త్రీలు భార్యగా తమ స్థానం కోల్పోతే ఆ తరువాత వాళ్ళు తామేదో హత్యల కంటే పెద్ద నేరాలు చేసిన వాళ్ళలాగా తమ మొహాలు దాచుకుని, చీకటి మూలల్లో బందీలై జీవితాంతం మగ్గిపోవాల్సిందే. అలా అయితే మీరుకూడా భార్యలు చనిపోయినప్పుడు మీ మొహాలు దాచుకుని, తల మీసాలూ గొరిగించుకుని, అడవుల్లోకి వెళ్ళిపోయి మిగిలిన జీవితం గడపేయచ్చు కదా! మీరా? మీరలా చెయ్యరు - భార్య చనిపోగానే ఇంకో ఆమెని పదో రోజుకే తెచ్చుకుంటారు. అందుకే ఏ గొప్ప వివేకవంతుడైన దేవుడో మిమ్మల్ని ఇలా చెయ్యమని చెప్పాడని సాక్ష్యం చూపండి! నిజానికి స్త్రీకేదైతే మంచిదో పురుషులకి కూడా అదే మంచి దవ్వాలి కదా! మీ విషయంలో ఏం భేదం ఉందసలు? మీరంతా ఏదో ఉదాత్తమైన నాయకులనుకుని దేవుడు స్వాతంత్ర్యం ఒక విశిష్టమైన వరంగా మీకిచ్చాడా?

మీకు గొప్ప పేరు ప్రతిష్టలు, మీలో ఉన్నాయనుకునే ఆ ఉన్నతమైన లక్షణాలను బట్టే వస్తాయి. ఎవరూ ఆ ఉన్నతమైన లక్షణాలను జాగ్రత్తగా పరిశీలించి చూడకపోతే! నిజానికి మా ఆడవాళ్ళకి ఝాన్సీరాణీ లాంటి వాళ్ళు మార్గం చూపటానికి కూడా అక్కరలేదు. ఏ బంధాలూ లేని మూడు నాలుగు వందల స్త్రీలను, తీసుకుని, వారి చేతిలో తుపాకులుంచి ఆ తరువాత చూడండీ వారు మిమ్మల్నేం చేయగలరో! మీకు ఆపైన దాక్కోవటానికి స్థలం పొయ్యి దగ్గర కూడా దొరకదు. పూర్వపు మరాఠా రాజ్యాల్లో ఎంతోమంది నిజమైన శూరులు, ఒకనాటి ఢిల్లీ సింహాసనాన్ని ఒక ఊపు ఊపిన వాళ్ళు ఉండేవాళ్ళు. ఇప్పుడు ఇంగ్లీషు వాళ్ళ రాజ్యం వచ్చింతరువాత మీ అద్భుతమైన శక్తులన్నీ పోయి మీ ఆనందాలన్నీ కూడా అంతమైపోయేయి. పూర్వపు సామెత "ఎవరూ నిన్ను పొగడకపోతే నిన్నే నువ్వు పొగుడుకోవాలి," అన్నట్టు కదనరంగంలో కాక ఈ రోజు కలాలు కదపటంలో మాత్రమే మిమ్మల్ని మీరు శూరులని పిలుచుకోవచ్చు. లేకపోతే మిమ్మల్ని ఎవరు పట్టించుకుంటారు? ఇంకా చెప్పాలంటే గొంతు నిండా తిండి మెక్కటంలో మాత్రమే మీరు శూరులని చెప్పుకోవచ్చు. అదే మీకసలు సరిపోయే పేరు.

మీరు నిజంగా కలం ఉపయోగించటంలో చతురత గలవాళ్ళు, పవిత్రులు, దయ కరుణ గల వాళ్ళైతే, మీరు నిజంగా ఉండవల్సిన ముప్పైరెండు సద్గుణాలూ ఉన్న వాళ్ళయితే, మీకు మీ తోటి ప్రాణులపైన ఏ మాత్రం ప్రేమ లేదేంటి? మీలోమచ్చుకు ఒకచిన్న ముక్కయినా ప్రేమ లేదేంటి? లేకపోతే మీరు మీలోని ప్రేమంతా అడవుల్లోని పులులకు అరువిచ్చేశారా?

మీ అభిప్రాయంలో మనసొంత జీవితాలే మనకు ఇతరుల జీవితాల్ని అర్థం చేసుకోవాటానికి దారిచూపాలి. ఇక్కడ మరి మీ జీవితాలకేమైంది? మీజీవితం మీకెంత ప్రియమైందో ఒకస్త్రీకి కూడా ఆమె జీవితం అంతే ప్రియమైంది కదా! స్త్రీలను పురుషుల లాగా కాక వేరే ఏదో పదార్థంతో భూమిలోని మట్టి నుండో, రాళ్ళనుండో, తుప్పు పట్టిన ఇనుము నుండో తయారు చేసినట్టూ, మీజీవితాలేమో శుద్ధమైన బంగారం నుండి చేసినట్టు మాట్లాడుతుంటారు. మీ దృష్టిలోస్త్రీ ఒక పేనో, ఈగో లాంటి అల్పమైన జీవి. మీఅనుభవమేమో ఇదంతా సరైనదేనని మంచిదేనని చెప్తుంది. నేననేదేమిటంటారా? ఒక్కసారి స్త్రీ భర్త చనిపోయిం తరువాత ఆమె పడేపాట్లు కుక్కకూడా సహించదు అంటున్నాను. ఆమె కికముందు జరిగేదేమిటి? ముందుగా ఆమె ఉంగరాల జుట్టు పూర్తిగా, మీకళ్ళు చల్లబడేలా తీసెయ్యటానికి మంగలి వచ్చేస్తాడు. ఆమె ఆభరణాలన్నీ తీసేసుకుంటారు. ఆమె అందమంతా మాయమయిపోతుంది. ఆమెని ఎవరికీ చెందని దానిలా అన్నీ తీసేసి వికృతంగా తయారుచేసి, ఒక పనికిరాని కుండలాగా ఒకమూల దాచి

పెడతారు. పునిస్త్రీలు వెళ్ళే పెళ్ళిళ్ళకి, వేడుకలకీ, మిగిలిన శుభకార్యాలన్నిటికీ ఆమెని దూరంగా ఉంచుతారు. ఈ నిబంధనలన్నీ దేని కోసం? ఆమె భర్త చనిపోయినందుకేనా? ఆమె దురదృష్టవంతురాలు; అది విధిఆమె నొసటను రాసిన రాత; అమె ముఖమెవ్వరూ చూడకూడదు; అది దుశ్శకునం. ఇప్పుడు ఆమె ఇలాంటి వాటన్నిటికీ ప్రతీక. సరే ఆమె భర్త చచ్చిపోయాడు. చనిపోలేదని ఎవరూ అంటంలేదుకదా! ఆమేమైనా భగవంతుణ్ణి రహస్యంగా "నాభర్తను తొందరగా తీసుకుపో స్వామి అని ప్రార్థించలేదు కదా! నిజానికి ఆమె దేవుణ్ణి తనపై కరుణజూపి "స్వామీ, నాభర్తను తొందరగా తీసుకుపో, నాకు ఈ హింసల నుండి విముక్తి కలిగించు" అని ప్రార్థించి ఉండచ్చు . కాకపోతే ఆ మహారాజు పోతే తాననుభవించాల్సిన బాధలు తల్చుకుని ఆ ఆలోచనలు విరమించుకుని ఉండచ్చు.ఎవరు చెప్పగలరు? కాదు- పూర్వం మనవాళ్ళన్నట్టుగా "పాపం నారాయణుడు చేశాడు. ప్రాయశ్చితం కేశవుడు చెయ్యాలి." ఒక భర్త జీవితం చివరకు వచ్చేసింది. ముగిసిపోయింది. అతను మంచి చెడులన్నీ బేరీజు వేశారూ, అతను వెళ్ళిపోయాడు. కాని దానికి భార్య నెందుకు బాధ్యురాల్ని చెయ్యాలి? పోనీసరే! ఆమెదే బాధ్యత అనుకుందాం. ఆమె భర్త చనిపోగానే జీవితంలో అన్నీవదిలేసుకుని ఒకప్రక్కన కూర్చుని "హరి, హరా" అని భగవంతుడికి మొర పెట్టుకుంటూ కూర్చోవాలి అని ఆశిస్తే మరి పురుషుడుకూడ అదేపని ఎందుకు చెయ్యగూడదు? మరి అతనెందుకు చక్కగా వెళ్ళిపోయి మరోస్త్రీని పెళ్ళి చేసుకుని సంతోషంగా జీవితం గడిపెయ్యాలి? శాస్త్రాలు రాసిన పండితులు తమ క్రూరమైన చూపులు స్త్రీలపైనే ప్రత్యేకంగా నిలబెట్టారా? బహుశ ఎప్పుడో ఒక కాలంలో ఎవరో స్త్రీ వెళ్ళి వాళ్ళ ఇళ్ళు తగ బెట్టడమో మరేదోపనో చేసి ఉండాలి. బహుశ ఆ ఒక్క స్త్రీ గురించి ఈ శాస్త్రాలన్నీ కొత్తగా రాసేసి అది అందరి స్త్రీలకూ ఆపాదించారేమో!

వాళ్ళు అవే శాస్త్రాలను అప్పుడే మగవాళ్ళపైన కూడా రుద్ది ఉంటే, అదీ బాగానే ఉండేది. కాని వాళ్ళతో మనం ఆపని ఎప్పటికైనా చేయించగలమా! ఆ శాస్త్రాలు రాసిన వాళ్ళు ఆ శాస్త్రాలు తయారు చేసినప్పుడు వాళ్ళబుర్రలని చాలా తెలివిగా ఉపయెగించారు. అంతావాళ్ళకనుకూలంగా రాసుకున్నారు. బ్రహ్మాండంగా ఉందంతా! అదే సమయంలో వాళ్ళు "ఏమగవాడూ మొదటిభార్య చనిపోయిం తరువాత రెండో పెళ్ళి చేసుకోకూడదు. అలాచేస్తే తల్లితో కూడిన నంత పాపం. అందుకు అతన్ని కులంనుండి వెలి వెయ్యాలి" అని రాసే సారనుకోండి. ఆమరురోజేవాళ్ళల్లో ఒకరి భార్య హఠాత్తుగా చచ్చిపోయిందనుకోండి. జనాలు అతన్ని కూడా "అతనినుదిటిమీద దురదృష్టం రాసిపెట్టి ఉంది. అతని ముఖం మేము చూడకూడదు "అనేవాళ్ళు. అతన్ని పెళ్ళిళ్లకవీ రానీయకుండా ఊరి బయట ఏ మఠంలోనో అతన్ని బందీ చేసేవాళ్ళు. దీన్ని బట్టి మనకు స్పష్టంగా అర్థమవటం లేదా ఈ శాస్త్రాలు రాసిన వాళ్ళు ఎంత మందైనా భార్యలను పెళ్ళాడటానికి అవకాశం ఇచ్చినప్పుడు వాళ్ళకనుకూలంగానే ఆలోచించారని. ఇంకేం వాళ్ళ అదృష్టం పండింది. భార్య చనిపోయినా, పాపం దురదృష్టవంతురాలు జబ్బుపడ్డా ఇంకేం మనవాడు వెంటనే ఇంకో ఆమెని చిక్కించుకుంటాడు. అతడు డబ్బున్నవాడు కూడా అనుకోండి మరింత అదృష్టవంతుడన్నమాటే! రెండురకాల హోదాఅతని వరం అవుతుంది. ఒకటి అతడి డబ్బు వల్లా, రెండోది అతడు మగవాడవటంవల్లా! అతన్నింక వెనక్కిలాగేది ఒక్కటీ ఉండదు.

ఒకవేళ ఎనభై ఏళ్లు పైబడి వళ్లంతా ముడతలు పడిన సకల గుణాభిరాములెవరైనా మీకు తెలిసి ఉంటే వాళ్ళకు కూడా, "అదేం మాటండీ, మీకు పెద్దతనం వచ్చిందనెవరంటారు? ఎవరైనా ఆ మాటంటే వాళ్ల పళ్లురాలగొడతా"నని చెప్పే జిడ్డు మొహం భజంత్రీ గాళ్ళుంటారు. వెంటనే ఆ పెద్దాయన "నా జుట్టు చూడవయ్యా? దీని మూలానే అంతా చెడిపోయింది," అంటాడు. "దానిదేముందండీ, ఈ క్రీముని కాస్త తీసుకుని తలకి రాసుకున్నారంటే రేపటి కంతా తెలుపు ఆనవాలు కూడా లేకుండా సరైపోతుంది," అనిభజంత్రీసమాధానం . "అదిసరే, నాజుట్టు బాగైపోయిందీ. మరీ పళ్ళ సంగతేమిటి? నోట్లో ఒక్కటి కూడా మిగల కుండారాలిపోయాయి. దీనిగురించేమైనా చెయ్యటానికి అవుతుందా? "అంటాడాయన' అదొక

పెద్దసమస్యేమిటండీ! రేపే దంతవైద్యుడి దగ్గర కెళదాం. మొత్తం కొత్త పళ్ళు. ముప్ఫైరెండూ కట్టించుకుందాం. ఈ సారి పళ్ళుతోముకునేప్పుడు ఇంకేమైనా ఒకటీ ఆరాపాతవి మిగిలి ఉంటే ఉంటే వాటిని పీకేయ్యండి." ఇంకేం ఆయన ఆపనికి సిద్ధంగా ఉంటాడు. "పాతికేళ్ళ కుర్రాళ్ళు కూడా ఇక మీ ప్రక్కన నడవటానికి ధైర్యం చెయ్యరు. మనవిపాత ఎముక లేనండీ! అయినా మిరియాలు పాతవైనా, పుచ్చినా జొన్నల కన్నా తక్కువ కొస్తాయా చెప్పండి. "ఇంకేం ఏర్పాట్లనీ అయిపోతాయి.ముసలాయన అలాంటి ఆలోచనలకే పొంగి పోయి, గర్వంగా ఛాతీవిరుచుకుంటాడు. అతని తలపై మిగిలిన నాలుగు మొలకల జుట్టూ, అతని కనుబొమ్మలూ, మీసాలూ దూదిలా తెల్లబడిపోయినా అతని దగ్గర నూరు రూపాయలు పెట్టి తెప్పించిన తైలం ఉంది. తనువిన్న సలహా ప్రకారం దాన్ని రోజుకు మూడుసార్లు రాసుకుంటాడు. మంచిమంచి బట్టలేసుకోవటం మొదలుపెడతాడు. ధోవతి చక్కగా మడతలు పెట్టి గట్టిగా కట్టుకుంటాడు. జరీ అంచు తల పాగా పెట్టుకుంటాడు. కొత్తగా మెరిసే చొక్కా బలవంతంగా అతని ముసలి శరీరానికి ఎక్కించేస్తాడు. భుజంపైన చక్కటి కండువా, కట్టుడు పళ్ళు బోసి నోట్లో తగలిస్తాడు. ఇంకా ఆ పెట్టుడుపళ్ళు ఎఱ్ఱగా మెరవటానికి నోట్లో దంచిన వక్కాకు దట్టిస్తాడు. ఎర్రని ఆకు చెప్పులు కాళ్ళకీ, దారిలో అడుగు తడబడకుండా విదేశాలనుండీ తెప్పించిన చేతికర్రా! ఇకపోతే అతను భుజించే దేమిటో తెలుసా! బాదంపప్పు పాకం, వేయించిన తీపి పిండివంటలు, కూరగాయలతో చేసిన హల్వాలూ, రోజుకు పదిసార్లారగించటం శరీరానికి ధృడత్వం రావటానికి. బుగ్గలు లోతుకుపోయిన అందవికారమైన ముసలి ముఖాన్ని రోజుకు అరడజనుసార్లు అద్దంలో చూసుకుని, లోలోపల పొంగిపోతూ దారిని పోయేవాళ్ళందరినీ అడుగుతూ ఉంటాడు." ఏమోయ్! నేనీ మధ్య ఎలాకనబడుతున్నానంటావ్? బాగున్నాను కదా!" ఒకరోజు ఎవరో చిలిపివాడు తగిలి "భలేవాళ్ళండీ! మీకు పెద్దతనమేంటండీ! మన గణపతిగారికంటే ఒక్కరోజు కూడా మీకు వయస్సెక్కువ ఉండదండీ! మీరుమళ్ళీ ఒక భార్యను వెతుక్కోవాలి. మాకే ఇంట్లో ఈ మధ్యేం పొద్దు పోవటంలేదు. మీకెలా జరుగుతుందండీ! మన పెద్ద వాళ్లు చెప్పనే చెప్పారు. ఆర్థిక ఇబ్బందుల్లో బంధువులవసరం. అదే విరోచనాలైతే భార్య ప్రక్కనుండాలి అని" అంటాడు.

ఇంకేముందీ! మన ముసలాయన ప్రతి నిముషం ఒక స్త్రీ కోసం ఒళ్ళంతా కళ్లు చేసుకుని వెదుక్కుంటూ గడిపేస్తాడు. ఇంకేముంది పనైపోతుంది. ఆముసలి పీనుగు రెండుమూడు వేలు ఖర్చుపెట్టి ఏలేడికళ్ల యువతినోతన కోసం తెచ్చుకుంటాడు. ఒక మేక పిల్లను కసాయి వాడి నుండి కొని దాన్ని పులి వేటలో ఎరగా కట్టేసినట్లు. ఒకరోజు బయటకు వెళ్ళినతడు ఎక్కడో ఒక చోట ప్రాణాలు వదలుతాడు. అంతే కథ ముగిసిపోతుంది. అతని ప్రాపంచిక జీవితం ముగిసిపోతుంది. కష్టాలన్నీ భరించటానికి ఆమె మిగిలి పోతుంది భూమ్మీద. అవునా కాదా?

మీ రెవరైనా ఒక స్త్రీ ఇలాంటి వేషాలు వెయ్యటం చూశారా? ఒకసారి ఆమె మీద ఆకాశం నుండి గొడ్డలి వేటుపడింతరువాత, ఆమె విధవమోయాల్సి బరువులు మోస్తూ, పోయిన భర్త మంచి గుణాలూ, చెడ్డగుణాలూ కూడా పొగుడుతూ, ఇంట్లో మిగిలిన వాళ్ళందరి ఛీత్కారాలూ తనుచనిపోయేవరకు సహిస్తుంది.

భర్తకు చిన్న జబ్బుచేస్తే భయంతో స్త్రీ గొంతు తడారిపోతుంది. అతన్ని జాగ్రత్తగా చూసుకుంటూ తన ప్రాణం కంటే అతని గురించి ఎక్కువ ఆందోళన పడుతుంది. అది భక్తి అని మీరనచ్చు-భయం వల్లకూడా కావచ్చేమో! ఆమె అతని మాటను తూచాతప్పకుండా పాటిస్తుంది. స్త్రీఅయినా పురుషుడైనా ఎదుటి వారితో ప్రేమగా నిజాయితీగా ఉండచ్చు. కాకపోతే స్త్రీ భర్తతో మంచిగా ఉండకుండా ఉండే

అవకాశమే లేదు. కాకపోతే ఆమె ఆలోచనలు ఆమెకి తప్పక ఉంటాయి. ప్రొద్దుగూకే సరికి మీచిత్తానుసారం మీరిచ్చిన తెగడ్తలో పొగడ్తలో ఆమె మీనుండి పొందుతున్నప్పుడు, ఆమె మంచి గుణవంతురాలుగా ఉండాలని మీరు ఎలా చెప్పగలరు? సహజంగా మనుషులు నడుచుకోవటం, మంచి గానైనా చెడుగానైనా, అవతవాళ్లనుండే నేర్చుకుంటారు. మీరొక్కసారి ఒక మోసగాడి వల్ల దెబ్బతింటే, మీరతనికంటే పదిరెట్లు పెద్ద మోసగాడయ్యే అవకాశంలేదా!

ఈ విషయమైనా అంతే! ఇంగ్లీషులో ఒక సామెత ఉంది కరుణ నుండి కరుణ పుడుతుందని. కరుణ కడుపు నుండి కరుణ పుట్టినట్లే, మీరు మీమనసులో పుట్టే ఆలోచనల గురించి ముందు తరచి చూసుకుని, దానివల్ల అవతల వాళ్ళకేం ఆలోచనలు పుడతాయో లెక్కవేయండి. అయితే మగవాళ్ళ విషయంలో ఇది కూడా పనికి రాదు. ఒక పురుషుడి భార్య ఒక సంవత్సరమో, రెండుసంవత్సరాలో, జబ్బుగా ఉంటే ఆమె ఎప్పుడు పోతుందా ఇదంతా ఎప్పుడు ముగుస్తుందో అని ఆలోచిస్తాడు. లేకపోతే "ఆమెకి మందులుపోసి పోసి విసుగెత్తి నాకేజబ్బు చేసేట్లుంది" అంటాడు. అదేస్త్రీ అయితే ఆమె పరిస్థితులెలాంటివైనా జనం ఏమనుకుంటారో అనే భయంతో అయినా అలా అనలేదు. భర్తను మాత్రం అతనెలాంటి వాడైనా, ఎలాంటి పరిస్థితుల్లోనైనా ఆమె గౌరవంగానే చూడాలి. ముస్లిములలో లాగా, మీరెలాంటివారైనా పేర్లు మాత్రం గొప్పగానే ఉండాలి. ఒక మనిషి ధనవంతుడైతే, 'అమీర్' అని, పేదవాడైతే 'ఫకీర్' అని, చనిపోయిన తరువాత అతన్ని 'పీర్' అని పిలుస్తారు. అలాగే పెళ్ళి కానివాడు, 'బ్రహ్మచారి' అని పిలువబడితే పెళ్ళైనవాళ్ళని గృహస్తులనీ, కుటుంబీకులనీ పిలుస్తారు. జీవితంలో అనేక దశలు దాటి పోయి ప్రాపంచిక జీవితం వదిలివేసిన వాణ్ణి 'సన్యాసి' అంటారు. అంతటితో సమాప్తం. రోజులో సన్యాసం తీసుకోవటానికి సాయంకాల సమయం మంచిది గదా! కానీ మీరు మాత్రం ఆఖరిక్షణం వరకు డాక్టర్లింక మీ జీవితంపై ఆశలేదని చెప్పేవరకూ వదలరు. అప్పుడు, అప్పుడుమాత్రమే, మీరు సన్యాసం పుచ్చుకుంటారు, చివరకు తెల్లారేముందు.

ఎటువంటి జిత్తులమారి గుంటనక్కలుమీరు, నిజంగా అసాధ్యులు, భగవంతుడే గనక ఈ ఇంగ్లీషు వాళ్ళ ప్రభుత్వాన్ని ఎప్పటికీ కొనసాగిస్తే! ఈ ఇంగ్లీషు వాళ్ళ ప్రభుత్వాన్ని చివరి వరకూ కొనసాగిస్తే వాళ్ళు వచ్చిం తరువాతే స్త్రీలకు చదువుపరంగా లభించింది. మానసికమైన, బాహ్యమైన అన్నిరకాల పరిస్థితులనూ ఎదుర్కొనే విధంగా వాళ్ల మనస్సులు ధైర్యాన్ని పుంజుకున్నాయి. వాళ్ళ హృదయాల్లో, గూడుకట్టుకున్న అజ్ఞానం చెదిరిపోయింది. వాళ్లకేది మంచిదో, చెడ్డదో తెలుసుకోగలుగుతున్నారు. ఎవరితో ఎలా మెలగాలో, జీవితమనే బండిని ప్రపంచంలో ఎలా తీసుకెళ్ళాలో, సత్యం, ధర్మం, పాతివ్రత్యమంటే ఏమిటో కొంతవరకు అర్థం చేసుకున్నారు. వీటన్నిటి మూలంగా భారతదేశంలో పరిస్థితులు కొంతవరకు మారబోతున్నాయి. కాకపోతే ఇంకా కొంతమంది, పూనా వైభవ్‌లాంటి వార్తాపత్రికలు మాత్రం నరనరాన స్త్రీలని ద్వేషించే వాళ్ళున్నారు. వీళ్ళకి కొత్తగా వస్తున్న మార్పులన్నిటి పైనా ద్వేషమే, లేకపోతే ఆ పేపర్లో పడిన వ్యాసాల మూలాన అలా అనిపిస్తుందేమో! అలాంటి వ్యాసాలు గతమూడునాలుగు నెలలుగా పత్రికలలో తరచూవస్తున్నట్టున్నాయి. విజయలక్ష్మి అనే ఒకవిధవరాలు గర్భస్రావం చేయించుకోవటమో లేక పుట్టిన బిడ్డను స్వర్గానికి పంపటమో చేసినట్టుంది. ఆ విషయంపై ప్రస్తుతం విచారణ జరుగుతోంది. పాపం ఆవిధవరాలి గురించి సహృదయంతో ఆలోచించినవాళ్ళెవరో గవర్నమెంటుకి విధవరాళ్ళు తప్పక పునర్వివాహం చేసుకునేట్లు చెయ్యాలని రాసేశారు. ఇంకేముంది, మాహానుభావుడు పూనే వైభవ్ పత్రికె ఎడిటర్‌కు విపరీతమైన కోపం వచ్చేసింది అరవటం మొదలుపెట్టాడు. ఇంగ్లీషు ప్రభుత్వం మన మత విషయాల్లో వేలుపెట్టకూడదూ" అని. నిజానికి ఆయన మిగతవాళ్ళకి భిన్నమైన వాడేకాదు. చూడటానికి అతడు సంఘ

సంస్కర్తలాగా ఉండడుగానీ అతడు సంస్కర్తే. కాకపోతే అతని సంస్కారాలన్నీ ముసుగువేసుకుని ఉంటాయి. మీరు శ్రద్ధగా గమనిస్తే ఐరోపా వాసులకు మనకు పెద్ద ఏ త పరమైన భేదాలు ఇప్పుడేమున్నాయి? ఒకటే ముఖ్యమైన భేదం ఉంది. అదేమిటంటే వేరే కులంలో స్త్రీని పెళ్ళి చేసుకోవటంకానీ, ఆమెతో ఇతర శారీరక సంబంధాలు కలిగి ఉండటం కానీ మనవాళ్ళు చెయ్యరు. అదొక్కటే ప్రస్తుతం మిగిలి ఉంది. ఇక మిగిలిన వాటిలో ఐరోపా వాసుల అలవాట్లను మీరు వేటిని సొంతం చేసుకోలేదు?

వాళ్ల బట్లలాంటివే మీరూ వేసుకుంటున్నారు. మీరు కూడా వారంత లేక ఇంకా ఎక్కువగా విద్యావంతులైనారు. వారుతినే మాంసంగానీ, పుచ్చుకునే పానీయాలు గానీ మీరుకూడా సుష్టుగా ఆరగించటం మొదలు పెట్టారు. అన్ని విషయాలలో వాళ్ళననుకరించే ప్రయత్నం చేస్తూనే వాళ్ళు మనమతంలో కలుగు చేసుకోకూడదని గొడవ పెడుతుంటారు. అయినా ఈ రోజుల్లో ఈ మతమెంత వరకు మిగిలి ఉందని? మీకిష్టం వచ్చిన చోటకు రైళ్ళల్లో పడవల్లో వెళ్ళి వస్తుంటారు. అచ్చువాళ్ళలాగే బట్టలువేసుకుంటారు. ఒంటిమీద చొక్కా, తలపై టోపీ, పాంటు, సాక్స్, బూట్లు, జేబురుమాలు చేతిలో, ఆపై నోటిలోపైపు. మీరుకూడా సిసలైన దొరల్లా తయారవుతుంటారు. (ఒకటే భేదమేమిటంటే వాళ్ళు పూర్తిగా తెల్లగా ఉంటే మీరు సగం నల్లగా సగం తెల్లగా మచ్చల గుఱ్ఱంలా ఉంటారు) తినకూడని పదార్థాలు మీకు మనసు పుట్టినప్పుడుల్లా తింటారు. చెయ్యగూడని పనులన్నీ చేస్తారు. మళ్ళీ వెనక్కితిరగి పోయి మీరేధర్మాన్ని కాపాడే కర్తల మంటారు. అలా మాట్లాడటానికి మీకు కొంచెం కూడా సిగ్గు వేయదా?

మీరు ఓడల్లోకి ఎక్కిపోయి, మీకులస్థులొక్కళ్ళు కూడా లేని దేశాలకి వెళ్ళిపోతుంటారు. మీరు అక్కడి వాళ్ళతో కలిసిపోయి సంవత్సరాలు సంవత్సరాలు వాళ్ళ సాన్నిహిత్యంలో గడుపుతారు. ఆతరువాత వెనక్కి తిరగివచ్చి పంచగావ్య ప్రాయశ్చితం చేసుకుని మళ్ళీ తయారవుతారు, గర్వంగా కులంలో పంక్తిభోజానానికి.

మీకు మీరు అన్నీ సరై పోయాయని అనుకుంటారు. కానీ నిజంగా తినకూడనిపదార్థాలు తినేసింతరువాత మీ ప్రేగులు, స్నానాలు చేసి ప్రాయశ్చిత్తాలు చేసి గోమూత్రం వంటికి రాసేసుకున్నంత మాత్రాన శుభ్రపడిపోతాయా? మీమతం కోసం అసలన్ని కన్నీళ్ళు ఖర్చుపెట్టాలా? నిజానికి మనం మతాన్ని రక్షించుకునే అవకాశం ప్రభుత్వం ఈ విషయంలో కలగ చేసుకుని మీరు మీడబ్బంతా వరుసల కొద్దీ సీసాలు మీద ఖర్చుపెట్టడం, మీరు వేల కొలది కోళ్ళు వేరే పక్షులు, జంతువులు, ఆ ఆహారం కోసం చంపటం వగైరా ఆపటంలోనే ఉందికదా! "కొత్తవాడు ఇంట్లోకి అడుగు పెడితే ఇంటికి అపాయం వచ్చినట్లే," అనే పూర్వపు సామెత నాకు చాలా నచ్చుతుంది. నేను ఆసామెత ప్రకారమే పూర్తిగా నడుచుకొనేదాన్ని, మీరు తెల్లవాళ్ళ అలవాట్లను ఒక్కటీ తగిలించుకోకుండా మన ధర్మాన్ని అక్షరాలా పాటించి ఉన్నట్లయితే! పాపం, ఆ విధవరాళ్ళు కూడా వాళ్ళ అదృష్టాలెప్పటికీ బాగుపడవని అనుకొని ఊరుకునేవారు. ఇప్పుడు మనువు చెప్పిందీ వగైరా అన్నీ మారిపోయాయి, గాలిలో కొట్టుకుపోయాయి. ఇప్పుడు మిగిలిందేమిటి? తెల్లవాళ్ళు మీకంటే వేలరెట్లు మెరుగు. వాళ్ళు చిత్తం వచ్చినట్లు మన అలవాట్లలో ఒక్కదాన్నైనా అనుకరిస్తారా? దానికి విరుద్ధంగా మీ వేషాలు చూసివాళ్ళు నవ్వుకుంటారు? మీరే ఆలోచించండి. ఓరి గాడిదల్లారా! ఎవరైనా దూర ప్రాంతాల నుండి, మన పూర్వీకుల నుండి తిరిగి చూడటానికి వస్తే వాళ్ళు ఈ ప్రాంతాన్ని దేశాన్నీ కూడా గుర్తుపట్టలేరు. కిందటి యాభైసంవత్సరాలలో వచ్చిన కళలు, విద్యలు, మిగిలిన పెను మార్పులు-మీరే ఇల్లువదలి పారిపోయి కొన్ని సంవత్సరాల తరువాత తిరిగి వచ్చినా గుర్తుపట్టలేరు.

అవేంటంటారా? పూర్వం మీరు పురాణాలూ, వేదాలూ వినే ప్రాంతాల్లో ఇప్పుడు పెద్దగా ఎబిసిడీలు చదువుతున్నారు. ఆ రోజుల్లో మనుషులు ఎవరి తాహతు కొలదీ వాళ్ళు పూర్వపు పద్ధతుల్లో అలంకరించుకొనేవాళ్ళు. ఊలుశాలువాలు, ఆనుకుని కూర్చోటానికి బాలీసులు, కూర్చోటానికి చిన్న దిండ్లు, చిన్న చిన్న ఎత్తు పీటలు మొదలైనవి వాళ్ళు వాడేవాళ్ళు. ఇకపోతే వంటసామాగ్రికి మెటల్‌పాత్రలు, పళ్ళాలూ, కంచుతోదీపాలూ, నూనెలో బట్టపీలికలు నానబెట్టి వెలిగించిన పెద్ద దివిటీలు ఉండేవి. అవేవి కాకుండా ఇప్పుడేమో కుర్చీలు, మంచాలు, బల్లలూ, మనపాత్రలకి బదులు కప్పులూ, సాసర్లూ, కత్తులు, కత్తెర్లూ, చెంచాలూ, కిరసాయిలు దీపాలూ, చంద్రవంక ఆకారంలో ఉన్న దీపాలూ, చదువుకొనేందుకు వేరే దీపాలూ. పూర్వపు వరండాలూ, లోపలి మండువాలూ కాక ఇప్పుడు అన్నీ బంగాళాలే. సరే, ఇప్పుడు మనం బయటకెళదాం. బహుశ మీపాత కాలం నాటి చుట్టం ఈ ప్రాంతాన్ని పూర్వపు ఇళ్ళని బట్టేమైనాగుర్తు పట్టగలడేమో! కాని మనుష్యులు వేసుకునే దుస్తుల్ని బట్టి మాత్రం ఆయన ఇప్పుడేమీ గుర్తు పట్టలేడు. ఎందుకిలా అని మీరడగవచ్చు? ముందు మనుష్యుల తలపాగాలని చూశారంటే వాటిని ఏ కులం పద్ధతిలోనైనా సరే చుట్టేసుకుంటున్నారు, లేకపోతే టోపీలు, అదీకాకపోతే నల్లదో తెల్లదో పొడుగుగుడ్డ ముక్కలు తీసుకుని చేతికొచ్చిన పద్ధతిలో తలకి చుట్టేసుకోవటం. పది ఇరవై సంవత్సరాల క్రితం అలా ఏదో దొరికిన గుడ్డ తలకు చుట్టుకోవటం తెలుగువాళ్ళల్లోనూ, కుటుంబంలో ఎవరైనా చనిపోయి నప్పుడూ తప్పకనబడేదా? పూర్వపు రోజుల్లో తలకి గుడ్డ చుట్టుకున్నపద్ధతిని బట్టి ఒక వ్యక్తి తెలుగువాడనో, అతని కుటుంబంలో ఆ మధ్య ఎవరో చనిపోయారనో చెప్పేసే వాళ్ళం. ఈ రోజుల్లో ఎక్కడ చూసినా అవే తలపాగా కట్లు, కోట్లు, చొక్కాలు, గొలుసుకు వేళ్ళాడే గడియారాలు. ఒక మనిషి ఎవరో మీరెలా చెప్పగలరు? కిందకి చూస్తే మీకు కాళ్ళ మీద పాంటు, బూట్లు, సాక్సు కన్పిస్తున్నాయి. అతను ముస్లిమా? పార్శీవాడా? లేక తెల్లదొర వంటివాడా? మీరెళ్ళి అతన్నే అడగాలి అతనెవరో?

బట్టల గురించి ఈ వ్యవహారం. మీరు వాళ్ళాఫీసుల చుట్టే తిరుగుతూ ఉంటారు కదా! సరే పోనీ వాళ్ళలాగే బట్టలేసుకోండి. తెల్లగా ఉన్న వాళ్ళకైతే అవిబాగానే నప్పుతాయి. కానీ బొగ్గంతనల్లగా ఉన్న మనిషి అవి వేసుకుంటే చూడ్డానికి అతడేదో వింత వేషం వేసుకున్నట్టుంటుంది. అదివేషధారణలో ఉండే విచిత్రం. పుచ్చుకునే పానీయాలలో మరో విచిత్రం ఉందండోయ్. ఒక తెల్లదొర సామాన్యంగా ఒక సీసా రెండు రోజులు వాడుకుంటాడు. మనవాళ్ళకి మాత్రం నిముషానికి ఒకసీసా అవసరం. పైగా భోంచెయ్యటానికి ఒక పావురాల జోడు కూడా కావాలి. ఆ తరువాత బయలుదేరతారు ధర్మం గురించి తమెంత తాపత్రయపడుతున్నారో, మనధర్మం విషయంలో ఇంకొకళ్ళ జోక్యం ఎంత అనవసరమో చాటిచెప్పటానికి. అలాంటివాళ్ళ నేమనాలసలు?

చూడండీ, వాళ్ళు మీదేశానికీ మీ ప్రజలకీ కావాల్సిన విద్యలన్నీ తీసుకొచ్చారు. వాళ్ళు మనుషులుగా ఎలా బతకాలో మీకు చెప్పారు. అంతకు ముందూ మీరు మనుషులేకానీ అజ్ఞానంతో, బుద్ధిహీనతతో అడవి మనుష్యులుగా బతుకుతున్నారు. మీకు తెలిసిందంతా నువ్వొకటేస్తే నేనొకటేస్తాననటం. అప్పట్లో మరాఠారాజ్యంలో పోరాటాలూ, విప్లవాలూ ఉండేవి. అవన్నీ ఆపి మీకు విద్యనేర్పించటానికి వాళ్ళు కోట్లు ఖర్చు పెట్టారు. వాళ్ళు అన్నిరకాల విద్యలు, కళలూ, చట్టాలూ, నిబంధనలూతెచ్చి, ఆఫీసులూ, న్యాయస్థానాలూపెట్టి, అందరినీ శాంతి సుఖాలతో జీవించేట్లు చూశారు. కొండలను తొలచిరైలు మార్గాలు వేసి రైళ్ళు, అవే అగ్ని రథాలు, కదిలేందుకు ఏర్పాటు చేశారు. పూర్వకాలంలో ఏనాడో, దాదాపు ద్వాపర యుగంలో మనుష్యులు వీరులంతా, కార్లే, నాసిక్ లాంటి చోట్ల గొప్ప గుహలు నిర్మించారు-అవి నాకు తెలిసినవి, అవికాక భూమి లోతుల్లో వందల వేల గుహలున్నాయి. ఈ రోజుల్లో జనవాక్యం ఏమిటంటే

పాండువులు అజ్ఞాత వాసం చేసే రోజుల్లో ఈ గుహలన్నీ తొలిచారని. ఎవరైనా పాండవులని కానీ, ద్రౌపదినికానీ చూశారా? ఇప్పటి ప్రభుత్వమే నిజమైన పాండవులని చెప్పాలి. రామవిజయమనే కావ్యంలో శ్రీధరస్వామి ఇంద్రజిత్తు దేవుడికి అగ్నితో కూడిన అర్పణలు చేసాడని అందుకే తనకోసం అగ్నిరథం నిర్మించుకోగలిగాడని రాశాడు. కానీ ఆ అగ్నిరథం ఈ రోజుల్లోలాగా లెక్కలేనన్ని అతిబరువైన వస్తువులు గాలిలాగా చెప్పిన వేళకి చెప్పిన చోట్లకి తీసుకెళ్ళ గలిగేది కాదు. ఇవి మనం వర్ణింప శక్యమైన ఎన్నో అద్భుతమైన వింతల్లో కొన్ని మాత్రమే. ఒక రోజురాత్రివేళ వీపుమీద బోల్డెంత వెండి మోసుకుని బయటకెళ్ళడానికి ప్రయత్నించండి-మీకేభయం ఉండదు. మీ సుఖసంతోషాలకోసం ఈ ప్రభుత్వం ఎంతో చేసింది. వాళ్ళే మరింత ముందుకెళ్ళి మనమతంలోమార్పులు తెచ్చి, అబలలైన స్త్రీలనుసబలలుగా చేయకపోతే, వాళ్లని ఈ మోసపూరితమైన ధర్మమూ, అది సృష్టించే దుఃఖం నుండి కాపాడకపోతే, ఇంకెవరివన్నీ చేస్తారు?

వైభవ్ సంపాదకుడే మంటారంటే ప్రభుత్వం ఇప్పటివరకు చేసిన చట్టాలన్నీ కట్టెయొక్క పలుచని మొనలాంటివి మాత్రమేనని. ఆయన రాసే దాన్నిబట్టి చూస్తే మీమగవాళ్ళే మోసగాళ్ళు, ద్రోహులు. "విధవరాళ్ల తలలు మనం గొరిగించటం మానేస్తే, ఈ ప్రభుత్వం వందలకొలదీ భావనాఖానీ లాంటి వేశ్యా గృహాల్ని నిర్మిస్తుందనీ మీ దేవుళ్ళు కూడా వాళ్ళనే కంటి పాపలా కాపాడుతూ, దీవెనలన్నీ వాళ్ళపైనే కురిపిస్తారు. ఎన్నో కొత్త న్యాయస్థానాలు నిర్మించి విజయలక్ష్మికేసులలాంటివి చూడాల్సివస్తుంది." నిజానికి ప్రభుత్వం వేశ్యాగృహాలుకాదు ఆ స్త్రీలలో ప్రతి ఒక్కళ్ళకీ ఒక చక్కటి ఇల్లూ మీలాంటి వాళ్ళని వెయ్యటానికి ఒకపెద్ద కారాగారం నిర్మించాలి. ఎలాగంటారా? ఒకవేళ ప్రభుత్వం విధవావివాహం సాధ్యం చేసిందనుకోండి. అప్పుడు ఈ విధవరాళ్లల్లో ప్రతిఒక్కరూ తమ కొత్త భర్తలతో సంతోషంగా తమ గృహ సామ్రాజ్యాలలో జీవిస్తూ మానసికంగా దృఢపడి బ్రిటిషు ప్రభుత్వానికి జీవితాంతం అనుయాయులవుతారు. అప్పుడు ప్రభుత్వం ఈ సింహాల్లాంటో, మేకల్లాంటో మగవాళ్ళను వాళ్ళలో పొంగే కామంతో, వాళ్ళ తాగుడితోచెడిపోయిన బుర్రలతో, మాంసం నిండిన పొట్టలతో పట్టుకుని ఒకపెద్ద కారాగారంలో వెయ్యాలి. ఈపశువులలాంటి మనుష్యులతో గట్టిగా పనిచేయించి, ప్రస్తుతం అధిక శ్రమతో బాధలు పడుతున్న గేదెలు, దున్నపోతులు, గుర్రాలు, గాడిదలనొదిలేసి ప్రభుత్వం వారు చాలా డబ్బు కూడా ఆదా చేయచ్చు. వారు కనుక ఆ పని చేస్తే తమ ఖజానా నింపుకోవచ్చు, ఆ చేత్తోనే పుణ్యం సంపాదించుకోవచ్చు.

ఒక తల్లీ దండ్రీ తమ కూతురుని మీకాళ్ళు కడిగి ధారాదత్తం చేసింతరువాత ఇంక అంతే సంగతులు. ఒకసారి ఆమె ఇల్లు వదలివెళ్ళింతరువాత తిరిగి వాళ్ళకి కనబడదు. విచారకరమైన సంగతేమిటంటే సహజసిద్ధమైన మమకారంతో ఆ తల్లీ దండ్రి తమ బిడ్డను ప్రేమతో, గారాబంతో తమ శాయశక్తులూధారపోసి పెంచి పెద్ద చేస్తారు. ఆమెకు జీవితంలో మంచిస్థానం, సంతోషం దక్కాలనీ ఆమెకు కొత్తగా వచ్చిన అత్తమామలు ఆమెను ప్రేమతో చూడాలనేఆశతో ఎంతో కష్టపడి ఆమె వివాహప్రయత్నాలు చేస్తారు. ఆమె అదృష్టవంతురాలైతే అంతాబాగానే ఉంటుంది. ఒకవేళ కాకపోతే! జీవితాంతం ఆమెను తల్లీదండ్రీ ప్రాణంకన్నా ఎక్కువగా చూసుకున్నారు. ఏనాడూ వారిచేత చెంపదెబ్బకూడా ఎరుగని ఆమెకి మీముష్టిఘాతాలు వీపు మీదపడితే ఎలా ఉంటుంది? ఆమె తల్లిదండ్రులకెలా అన్పిస్తుంది? నేనీ ఘోర సత్యాలన్నీ రాస్తే రామాయణమంత పెద్ద గ్రంథం తయారవుతుంది. ఒకవేళ మీరు మీభార్యని బాగా చూసుకున్నా అది సామాన్యంగా పరుల చూపులకే పరిమితం. మీరు శరీరంపై భాగంలో అందమైన ఎరుపు రంగునూలు జరీకలిపినేసిన అద్భుతమైన అంగీపైన వేసుకుని, క్రింద భాగంలో చిరిగిన పాత దుప్పటి చుట్టుకునే వాడిలాంటివారు. మీరు ఆమెనిపైనుండి కిందవరకూ నగలతో నింపచ్చు, అభరణాలతోకట్టిన ఇంట్లో ఉంచవచ్చు. కానీ ఆమెను మీరు దయగా ప్రేమగా చూసుకోకపోతే ఆమె దుఃఖ తప్ప మరేమీ

అనుభవించదూ-అది ఎలాంటి దుఖఃమంటే అది ఒకరు వర్ణించలేనిది . అనుభవించి మాత్రమే తెలుసుకోవాల్సిందీ.

స్త్రీలు ఈ ప్రపంచంలో అన్ని రకాలైన శారీరకశ్రమ, కష్టం, ఆకలి, దాహం హింసలు, దెబ్బలు భరిస్తుంటారు. వాళ్లు మీనుండి కోరేది ఒక మంచి మాట మాత్రమే. నిజమే, మీరు బయటికెళ్ళి, డబ్బు సంపాదించుకు రావాలి. కానీ ఆమె ఇల్లు నడుపుకోవాలి, మీ మాట తూచ తప్పకుండా పాటించాలి, ఎల్లవేళలా వినయంగా ఉండాలి, అజ్ఞానంలోనే ఉండి, ఆమె శరీరంలోని ఆనందమంతా చిన్న చిన్న ముక్కలయి ఆమె ఎముకలు కరిగిపోయి, ఆమెరక్తం నీరయిపోయేవరకు అధిక శారీరక శ్రమ చేస్తూ, ఆమె కళ్ళు మాత్రం మీముఖం మీదే పెట్టుకుతిరగాలి. ఆమె వంకమీరు సాదరంగా చూసి, ఒక చిన్న నవ్వులో మీపళ్ళు తళుక్కున మెరిస్తే అదే ఆమెకి అలౌకిక ఆనందం. అదే ఆమెకు స్ఫూర్తినిచ్చి మరిన్ని పనులు భుజంపైన వేసుకుని, కొత్తగా నేర్చుకుని మరీ చేసేట్టుచేస్తుంది. మీకింతకు ముందు తెలిసిన సామెతనే చూడండీ. "భర్త పొగడ్తే తేనె, అమృతం లాంటిది" అని. ఆమె ఒక అందమైన కుట్టుపని చేసిన బట్ట తీసుకుని వచ్చి చూపించినా, మీకోసం మంచి పిండివంటచేసి వడ్డించినా మీరిలా అన్నారనుకోండి. అరే, ఇదినిజంగా నువ్వే చేసావా? చూడూ, మరీఅంత కష్టపడి పని చెయ్యక్కరలేదు. నీకు మళ్ళీ నడుంనొప్పి రావచ్చు. కళ్లకు దెబ్బకదా! మన పిల్లలు దీని వలన ఇబ్బంది పడిపోకూడదు. డాక్టరు చేతిలో నువ్వుపడకుండా చూసుకోవాలికదా! కొంచెం పని తగ్గించుకో!" లేకపోతే మీరు స్నేహితులతో ఉన్నారనుకోండి. "మీకు తెలుసా! నేను చాలా అదృష్టవంతుణ్ణి. ఇంట్లో ఏవిషయం గురించీ నేను ఆదుర్దాపడాల్సిన అవసరంలేదు. మా ఇంటికెళ్ళిపోయి అక్కడ కాలక్షేపం చేద్దాం పదండి. మాఇల్లంత హాయిగా ఉండే ఇల్లు ఇంకొకటి దొరకటం కష్టం," అన్నారనుకోండి. ప్రేమతో నిండిన ఆ పొగడ్తలు వినగానే చిన్నప్పటి నుండి ఆమె పడిన బాధలన్నీ, మీరు ఆమెని కొట్టి, గుద్ది, బూతులు తిట్టిన సంగతులన్నీ మరచిపోతుంది. ఆమె తనస్వామీ, ప్రభువు మాట్లాడిన మాటలు విని, భూమి మీద తనంత అదృష్టవంతురాలు లేదనుకుంటుంది. ఆమె హృదయం మమకారంతో పొంగిపోతుంది. ఆమె మీనుండి పొందే చిన్న చిన్న ప్రేమచిహ్నాలకోసం ఆశగా ఎదురు చూస్తూ ఉంటుంది-మీరేమో ఆమెని తరచూ అవమానకరమైన పేర్లతో పిలుస్తూఉంటారు. ఈమాటలో అబద్ధమేమీ లేదు-ఇదే నిజానికి ఆమె నుదుట రాసిపెట్టినవిధి.

మరి మీరేమో దేవుళ్ళుకదా! మరెందు కిలాంటి విచిత్రమైన పనులు చేస్తూఉంటారు? ఇది ఎవరికైనా అర్థం అవుతుందా? చూడండీ! ఒకస్త్రీ తనమీద పెత్తనం చెలాయించేమనిషితో కట్టుబానిసలాగా జీవితాంతం గడుపుతోంది. ఆమె భర్త ఇష్టాఇష్టాలు జాగ్రత్తగా బంగారంతూచే ఒక చిన్న త్రాసుతో తూచినట్టు చూసుకుంటూ, ఇంట్లో తనకు మించిన బరువైన పనులు చేస్తూ, అతని కుటుంబంలో వాళ్లు ఆమెనే మన్నా సహిస్తూ ఉండాలి. ఒక్కోసారి ఆమె అద్దెకు తెచ్చిన దున్నపోతులా పని చేస్తూ ఉంటుంది. ఇంకొకసారి లేడి లాగా రాత్రింబవళ్ళు ఇంటికోసం ఇంట్లోని వ్యక్తులకోసం ఆదుర్దాగా పరుగులెడుతూ ఉంటుంది. ఇవన్నీ చేస్తున్నా ఆమెకు ఒక్కమాట మాట్లాడే అధికారం గానీ, తనసొంతం అనిచెప్పుకుంటానికి ఒక్కచిటికెడు గింజలు కానీ ఉన్నాయా? అయితే, విధాతానువ్వే చెప్పు, ఆమె నుదుట ఎలాంటి రాతరాశావో! ఆమె జీవితానికిన్ని రాసిపెట్టినట్లయితే ఆమెని నువ్వు పుట్టగానే ఎందుకు చంపెయ్యలేదు? అలా చేసిఉంటే ఇవాళ నీకు వేలకొలది మహిళల నుండి తిట్లు తప్పేవికదా!

మీ దేవుళ్ళు కూడా వాళ్ళనే కంటి పాపలా కాపాడుతూ, దీవెనలన్నీ వాళ్ళపైనే కురిపిస్తారు. మీతోటి జీవుల సర్వస్వతంత్రాల కోసం. ఆడవాళ్ళని బంధించి ఉంచటంలో మీకింత ఉత్సాహం

ఎలావస్తుంది? బహుశ మీకుకూడా మగవాళ్ళు, అలాంటి వాళ్ళకుండే గర్వం ఉండటం వలనేమో!

మీరుదేవుళ్ళు, అవునా! మీతలుపులు అందరికోసం ఏపక్షపాతం లేకుండా తెరిచే ఉంటాయి- మరిప్పుడిదంతా ఏమిటి? నిజానికి పక్షపాతానికి తండ్రుల్లాంటి వారుకదా మీరు! మీరే కదాపురుషుల్ని సృష్టించినట్టే స్త్రీలను కూడా సృష్టించింది. మరి ఒకరికి సంతోషం ఒకరికి దుఃఖం రాసిపెట్టావెందుకు? ఎంతపని చేశావు స్వామీ! కానీ దాని ఫలితం అనుభవించేది స్త్రీలు - వాళ్ళు మాత్రం తప్పకుండా కష్టాలు పడుతున్నారు.

స్త్రీలలో ఉంటాయనుకునే లోటుపాట్ల గురించి మేము చదువుతూ ఉంటాము, వాటి గురించి వింటూనే మా రోజువారి పనులన్నీ చేసుకుపోతుంటాము. మరి మగవాళ్ళలో ఈ లోపాలే లేవా? స్త్రీలే అబద్ధాలాడతారా, పురుషులాడరా మరి? మరి దొంగతనాల సంగతి, వేశ్యల చుట్టూ తిరగటం, చంపటం, దోచుకోవటం, మోసాలు, ప్రభుత్వపు సొమ్ము లంచాలుగా పుచ్చుకోవటం, అబద్ధాలని నిజాలుగా మార్చటం, నిజాలని అబద్ధాలుగా మార్చటం - మగవాళ్ళీ పనులేమీ చేయరా? కైకేయి దశరధుడికి, "నువ్వు రామచంద్రుణ్ణి పధ్నాలుగు సంవత్సరాలు అడవికి పంపి నా కొడుకు భరతుణ్ణి అయోధ్య సింహాసనంపై కూర్చోబెట్టమని" చెప్పే అంశంలో స్త్రీల గురించి చాలా చాలా రాశారు. కానీ ఆ రోజుల్లో పురుషులు, సత్యయుగంలోని వాళ్ళు నిజంగానే సత్యాన్ని వీడేవాళ్ళు కారు. ఒక్కసారి మాట ఇచ్చారంటే తప్పే వాళ్ళు కారు. హరిశ్చంద్రుడు స్వపట్నంలో కనబడిన బ్రాహ్మణుడికి రాజ్యాన్నే ధారపోశాడు. దానికి విశ్వామిత్రుడు అతణ్ణి నానా విధాల పరీక్షించాడు. ఒక పావురం కోసం శిబిరాజు తన శరీరంలో మాంసాన్నే కోసి తూకం వెయ్యటం కోసం త్రాసులో పెట్టాడు. యవనష్వరాజు ద్వారకాదీశుడు శ్రీకృష్ణపరమాత్మకిచ్చిన మాట నిలబెట్టుకోవటం కోసం తన శరీరాన్నే రంపంతోకోయటం కోసం ధారాదత్తం చేశాడు. అలాగే దశరథ మహారాజు రామచంద్రుణ్ణి కైకేయి ఆజ్ఞ ప్రకారం అడవుల్లోకి పంపి, అదే సత్యంలోని సారం అనుకున్నాడు. సత్యం కోసం పురుషులు ఎన్ని త్యాగాలకైనా ఓర్చేవారు. ఆ రోజుల్లో మనుష్యులు మూడు రకాల నిర్ణయాలకు తలొగ్గేవారు - అది స్త్రీలకు, పిల్లలకు, రాజులకు. కానీ ఇప్పటి పరిస్థితుల్లో జనం ఒకే ఒకళ్ళకి లొంగుతారు అది అధికారంలో ఉన్నవాళ్ళకి. పిల్లలు కూడా ఇప్పటికీ తమకి తోచినట్టు చెయ్యచ్చు. కానీ ఆడవాళ్ళు మాత్రం తామనుకున్నదేది చెయ్యలేరు, ఎలా చెయ్యగలరో నాకు తెలియటం లేదు. ఎవరైనా ప్రయత్నం చేశారా వీపు మీద తోలూడి పోయేలా దెబ్బలు తగుల్తాయి, ఆరు నెలలో సంవత్సరమో ఆ దోసు మిగిలిపోయేట్టు. ఈ రోజుల్లో ఆడవాళ్ళు చిత్తానుసారం ప్రవర్తిస్తే జరిగేది ఇదే. కనుక ఎవరా సాహసం చేస్తారు? ఇంకో స్త్రీ వీపు తయారయిన స్థితి చూస్తే అది చాలింక అన్పిస్తుంది. ఇక్కడ ఒక పద్యం చూద్దాం మనం, మీకే అర్థమవుతుంది దాని సారం.

స్త్రీ సుగుణాల వృక్షాలను నరికే గొడ్డలి మాత్రమే
వేల జన్మల్లో కూడా జీవులకు అడ్డంకీ
ఆమే మోహినీ అనీ, ప్రాపంచిక బాధలన్నిటికీ రూపం అనీ తెలుసుకోండి.
క్షణ క్షణానికీ మారే కోరికల సుడిగుండం, అవలక్షణాలకి పుట్టిల్లు, సిగ్గులేని తనానికి నగరమే,
తప్పులగని, మోసానికి నిలయం, అను మాసపు పొలం

స్వర్గ ద్వారానికి అడ్డం, నరక నగరానికి ద్వారం, మంత్ర తంత్రాలకి బావి,

ఈ స్త్రీ యంత్రాన్నెవరు తయారు చేశారో! తియ్యటి విషమిది, అన్ని జీవులకూ వలే ఇది.

ఇదేనండీ మీరు చేసేది - మీలో ఉన్న ద్వేషాన్నంతా స్త్రీల తలలపై గుమ్మరిస్తారు, మీకు మీరు ఎంతో గుణవంతులై పోవటానికి.

స్త్రీని మీలో సద్గుణాలన్నిటినీ నరికేసే గొడ్డలి లాంటిదని ఒక చెంప అంటూనే ఇంకో చెంప ఆమె ప్రాణం కన్నా ఎక్కువనుకుంటున్నారు కదా! మీ అధిపత్యంలోనే ఆమెని జీవితాంతం ఉంచుకుని, ఒకవైపు ఆమె మంచి చెడ్డలన్నీ చూస్తూనే మరోవైపు నిత్యజీవితంలో పనుల కోసం ఆమెతో దున్నపోతు చాకిరీ ఎందుకు చేయిస్తారు? నిజానికి దున్నపోతులు కూడా మీ కన్న కొంత వరకు నయమే! కనీసం వాటి బాగోగులు అవి చూసుకుంటాయి. సరే ఇవన్నీ వదిలేయండి ప్రస్తుతం.

కనుక అసలు విషయానికి వద్దాం. క్షుద్ర మంత్రాలలోకంటే ఎక్కువ హాని చేసే శక్తి స్త్రీలనే యంత్రాలలోఉందనుకుంటే వాళ్ళ కంటే మీకు గట్టి మెదళ్ళున్నాయి కదా! మీ చురుకైన బుర్రలతో మీరు చెయ్యనిపని ఉందా, మీరు తలపెట్టని దుష్కార్యం ఈ ప్రపంచంలో ఉందా? మీ గొప్ప అధికారాల ప్రక్కన పెడితే స్త్రీలకేం బలం ఉంది? వాళ్ళకేం లేనట్టు లెక్కే!

ఇంక రెండో విషయాని కొస్తే స్త్రీలు ఎన్నో భ్రమల్లో పడి గిరగిరా తిరుగుతారనేది నిజమే! కాని వాళ్ళు విద్యావంతులు కాకపోవటం మూలానే ప్రతి ఒక్క భ్రాంతీ వాళ్ళ బుర్రల్లోకి దూరిపోతుంది తేలిగ్గా. అయినా కూడా వాళ్ళ వ్యామోహాలన్నీ వాళ్ళ కుటుంబం చుట్టూనే తిరుగుతుంటాయి. ఇంక మీ మనస్సుల్లోకి తొంగి చూస్తే అందులో వ్యామోహాలు కంటి చూపు కందనంత వేగంగా గిరగిరా తిరుగుతుంటాయి. మీ మనస్సు ఎన్నోరకాల కుతంత్రాలనుచిలుకుతూ, దేశంలోవి విదేశాల్లోవి, ఊహల్లోనివి వాస్తవంలోనివి అన్నిటితో యంత్రాంగం చెయ్యాలనుకుంటుంది. ఈ రోజు మీరు ఏ వడ్డీ వ్యాపారినో మోసం చేసేసి కొన్ని వేల రూపాయలు అతన్నుండి మనం కొంట్టేయాలనచ్చు. ఏదో ఒక జాగిర్దారుకి కొంత సమాచారం ఇచ్చి అతని దగ్గర నాలుగైదు వందలు కాజేయచ్చు. ఈ రోజు మనం దొరగారికి అవీ ఇవీ చెప్పి న్యాయం ఒకడికి అనుకూలంగా ఉండేట్లు చెయ్యాలని కూడా మీరంటారని నాకు తెలుసు. ఇంకో రోజు ఒక నకిలీ దస్తావేజు తెచ్చి నకళ్ళు తీసి పుస్తకాల్లో ఎక్కించటానికి మీరాలోచన చెయ్యచ్చు. కానీ స్త్రీలు ఇలాంటి కుతంత్రాలు చెయ్యటం మీరెక్కడైనా చూశారా? "ఓ, ఆవిడా! ఎందుకో తనకు తాను చాలా గొప్ప అనుకుంటుంది- అమె తన ముక్కుతో ఏదో ఉల్లిపాయలు వలవబోతున్నట్టు మొహం పెడుతుంది. ఈ బడాయి లేడీని ఎలాగైనా వలపన్ని పదిలించుకోవాలి". ఇలాంటి వింత ఆలోచనలు ఆడవాళ్ళ బుర్రల్లోకి ఎప్పుడూ రావు. భూమి మీద స్త్రీ లంతా సూర్యుడిలా కాంతులు వెదజల్లరు, నిజమే! అలాగని వాళ్ళందరూ లోపలా బయటా గంగా జలమంత పవిత్రులా అంటే అదీకాదు. ప్రపంచంలోని స్త్రీలందరినీ కలుపుకుంటే వందలో పదిమందికి మాత్రమే మీలా విచిత్ర విన్యాసాలుచేసే బుర్రలుంటాయి. ఇంక మిమ్మల్ని పరిశీలనగా చూస్తే ఇలా చిత్ర విచిత్రమైన ఆలోచనలు చెయ్యనివాళ్ళు మీలో ఒక్కళ్ళూ ఉండరు.

ఇంక మూడో విషయానికొస్తే స్త్రీలు చంచలత్వానికి పుట్టిల్లు లాంటివారు! మీరు మగవాళ్ళు ఈ విషయంలో బుద్ధిమంతులనుకుంటున్నారా? మీరు తూకం వేసి చూశారనుకోండి. మీ వైపు పళ్ళాలు వంద రెట్లు వందన్నర రెట్లు బరువుగా దిగిపోతాయి.

నాలుగో అంశం, స్త్రీలు ఆలోచనా రాహిత్యంలో నగరాల్లాంటివారు. ఆలోచన లేకపోవటమనేది స్త్రీల చేతుల్లో మాత్రమే ఉందా? మరి మీరో, నీచంగా, నమ్మకద్రోహాలు చేస్తూ, ఎవరికో మాటిచ్చి మెత్తగా వాళ్ళ గొంతులు కోసే మీరు, ఎప్పుడూ ఆలోచనలేని పనులు చెయ్యరా? అవునవును మీరు ఆలోచనా సముద్రులే, అందుకోండి మాజేజేలు. మరి మీరు ఎంతో చదువుకున్నవాళ్ళు, ఆలోచనాపరులని ఆశిస్తాం

కదా! కానీ ఇంతకు ముందెవ్వరూ చూడని మూర్ఖపు పనులు, పైగా రోజూ, చేసేస్తుంటారు. అయినా మిమ్మల్ని మీరు గొప్ప మేధావులను కుంటారు. కాని నేను మిమ్మల్ని ఏమని పిలిస్తే సరిపోతుందనే ఆలోచనలో ఉన్నాను.

స్త్రీలు అజ్ఞానులు దొడ్లోకట్టేసిన గేదెల్లాగా! వాళ్ళకి చదవటం,రాయటం రాదు. నిజమే కానీ వాళ్ళకి దేవుడు తెలివితేటలస్సలివ్వలేదని అర్థమా? వాళ్ళు ఆలోచనాపరులు కాకపోయినా మీకంటే మంచివాళ్ళు. మీమగవాళ్ళంతా అసాధ్యులనేది నిజమే! మరొక్కసారి జైలుకివెళ్ళి చూడండీ, మీదేశపు మగవాళ్ళతో ఒక్కోజైలు ఎంతనిండుగా ఉంటుందంటే మీకు కాలు పెట్టడానికి కూడా చోటు ఉండదు. అవును, వాళ్ళంతా చాలా తెలివిగలవాళ్ళే. ఒకడేమో దొంగనోట్లు తయారుచేసినందుకు, ఇంకోడేమో లంచాలు తీసుకున్నందుకు, ఇంకొకడు వేరొకని భార్యనెత్తుకెళ్ళిపోయినందుకు, మరొకరు విప్లవాళ్లోపాల్గొన్నందుకు, ఇంకొకడు దొంగసాక్ష్యం చెప్పినందుకు, మరొకడు రాజువేషం వేసుకుని జనాల్ని నాశనం చేసినందుకు, ఇంకొకడు మరొకణ్ణిచంపినందుకు అక్కడకు చేరారు. మరిలాంటి గొప్ప తెలివిగలపనులు చేసినందుకే కదా ప్రభుత్వం రాజప్రసాదాల్లాంటి కారాగారాల్లో గౌరవంగా మీకు గదులిచ్చేది. ఎలాంటి స్త్రీలైనా ఇలాంటి పనులు చేస్తున్నారా? ఎన్ని కారాగారాలు స్త్రీలతో నిండివున్నాయి? వెయ్యిరెండువేల అంకెల్లో ఉండే మగవారికి ప్రతిగా ఒక్కవందమంది స్త్రీలుకూడా ఉండరు. స్త్రీలు చేసే పెద్ద బుద్ధి మాలిన పని ఏమిటని మననిమనం ప్రశ్నించుకుంటే, అదివ్యభిచారమని తేలుతుంది-మేరు పర్వత శిఖరమంత తప్పుఅదే. దానికి కారణమయిన వాళ్ళని తప్పక తప్పుపట్టాల్సిందే! ఒక స్త్రీ వివాహేతర సంబంధం పెట్టుకుందంటే దానికి ముందు మొట్టమొదట ఆమె మనస్సులో ఆ చెడుబీజాలు వేసిన వాళ్ళెవరు? మీరా, ఆమేనా? ఒకస్త్రీ ఎంత సిగ్గుమాలినదైనా ఆమె బలవంతాన ఏమగవాడి చుట్టూ చేతులు వెయ్యలేదనేది తిరుగులేని సత్యం. స్త్రీకి ప్రపంచంలో అన్నిటి కంటే సంతోషకరమైందేమిటి? మొట్టమొదట స్థానం ఆమెని అర్థం చేసుకుని ప్రేమించే భర్తకు వెలుతుంది. ఆమెదీ అతనిదీ ఒకే మనస్సైతే, ఆమెంత పేదదైనా, పూరిగుడిసెలో తిండి గుడ్డా లేకుండా ఉన్నా, ఎన్నోకష్టాలూ కడగళ్ళూ పడుతున్నా, దూరంగా వెళ్ళి అడవుల్లో నివసిస్తున్నా ఆమెకతనిపైనే మనస్సుంటుంది, ఆకష్టాలన్నిటినీ సంతోషంగా స్వీకరిస్తుంది. ఆమె దారిని ఆమెని వదిలేస్తే ఏ స్త్రీ వివాహేతర సంబంధాల జోలికి పోదు.

కానయితే ఒకటి. పూర్వపు స్త్రీలు ఇలాంటి పనులెప్పుడూ చెయ్యలేదనేది నిజంకాదు. మీరు చాలా గొప్పగా చెబుతుంటారు కదా! ఆ శాస్త్రాలనే చూడండీ. ఇప్పుడు మనకంత గందరగోళ పరిస్థితి లేదనుకోండి. అప్పట్లో ఒక మహారాజువారసులు లేకుండా మరణిస్తే, అతని భార్య ఆమెకి మనసైన మునితోకూడి వారసుల్ని పొందవచ్చు. ఆరాణిగారు ఒకడు గాక పదిమంది కొడుకులు పుట్టేవరకు అతన్ని ఆ పని మీదేఉంచుకోవచ్చు. మరి అక్కడ జరిగిందేమిటి? వివాహేతర సంబంధం కాదా! అదివ్యభిచారం కాదా? అదిశాస్త్రాలు ఒప్పుకునేపనేనా. నిజానికి ఆ స్త్రీకి మళ్ళీపెళ్ళి చేసుకునే సరైన అవకాశమంటూఉంటే ఆరాజ్యం మొత్తం మరింత బలంగా ఉంటుంది. మన దేశం ఈరోజంత పేదగా కరిగి పోతున్న వేలకొలది చిన్న చిన్న రాజ్యాలతో, జాగీరులతో, ఇనాములతో, దేశముఖులతో ఉండేది కాదు. ఈ చిన్న చిన్న దేశాలకి చాలావాటికి సరైన వారసులు లేకపోవటం వల్ల, వాళ్ళ ఎస్టేట్లన్నీ వెళ్ళి ప్రభుత్వ ఖజానాలో చేరిపోయాయి. కొన్ని ప్రాంతాలలో మిగిలిన ఆడవాళ్ళ తలలన్నీ గుండ్లు చేశారు. వాళ్ళకష్టాల నెవరూ పట్టించుకొనేవాళ్ళు లేకపోవటం వల్ల మీరుమిడతల దండ్లులా వాళ్ళమీద పడి,వాళ్ళని తుడి చేశారు. ఎంతో అందమైన దేవతాస్త్రీల్లాంటి వారు ఆరాజస్థానాల్లో ఉండేవారు, ఏనాడూ పాదాలతో నేలని కూడా తాకి ఎరుగనివారు మీ స్వార్థపూరితమైన కుతంత్రాల వల్ల దరిద్రులూ దేశదిమ్మరులూ అయిపోయారు. వాళ్ళకి మళ్ళీపెళ్ళి

చేసుకునే అవకాశం ఉండిఉంటే వాళ్ళకటువంటి దీనపరిస్థితి వచ్చేదా? అస్సలువచ్చేదికాదు. ఒకభర్త చచ్చిపోతే ఒక స్త్రీ బ్రతుకునుండి కూడా పూర్తిగా జీవం, రాయిలోలాగా, నశించినట్టు జమ. కానీ దానిమూలంగా ఇంకొక నాలుగో, అయిదో ఒక్కోసారి పది జీవితాలు కూడా ముక్కలై పోతాయి. ఇంకోవైపు చూడండీ, ఒక భార్యకు కొడుకు పుట్టకపోతే భార్యల సంఖ్య రెండు,మూడు, నాలుగు ఇలా పెరుగుతూ పోతూ ఉంటుంది. మరాఠాలలో దేశ్‌ముఖ్‌లలో ప్రతి మగవాడికీ నలుగురైదుగురు భార్యలు, కనీసం ముగ్గురు భార్యలుండచ్చు. దాన్నెవరూ ఏమీ తప్పు పట్టరు. ఉన్నట్టుండి మన ముసలికుర్రాడు స్వర్గానికి ప్రయాణం కట్టేస్తే అతని ప్రతి భార్యా, కొడుకులున్నా లేకున్నా, ప్రక్కన కూర్చుని తలకొట్టుకుంటూ ఏడవాల్సిందే. స్త్రీల మనస్సులు చాలా మెత్తటివి. వాళ్ళు మీలాగా కాకుండా చిన్న చిన్న వాటికే సంతృప్తి చెందుతారు. వాళ్ళ మెదళ్ళెప్పుడూ గొప్ప గొప్ప ఉద్యోగాలూ, చాలాడబ్బూ పొందాలనే ఆలోచనలతో గింగురు మంటూ ఉండవు.' జనంనన్ను సరిగా గౌరవిస్తున్నారా లేదా లేకపోతే 'ఆముసలి గోమాజీ' అంటూ తనగురించి చర్చిస్తున్నారా" అనుకుంటూ వాళ్ళు తరచూమధనపడుతూ ఉండరు. వాళ్ళు పొందలేని వాటిని పొందటానికి ప్రయత్నిస్తూ స్త్రీలు జీవితాలు గడిపేయరు. మీరు వెనక్కితిరిగి పోయి తెలివి తక్కువతనమంతా ఆడవాళ్ళదే అన్నట్లు మాట్లాడితే మేమనగలం?

ఇంక ఐదో విషయం-స్త్రీలే అన్ని అపరాధాలకీ నిధులని, నిజానికి దీనికి విరుద్ధమైనదే సత్యం. స్త్రీ తప్పుదోవపడితే అది ఎప్పుడూ మీమూలానే. ఇలా చూడండీ. ఎంతోమంది తండ్రులు తమ పది,పదకొండేళ్ళ కూతుర్లని, చిన్న చిన్న నక్షత్రాలలా మెరిసే ఆడపిల్లలని, పెద్దనోట్ల కట్ట కోసం ఎనభై తొంభై ఏళ్ళ ముసలి వాడికి కట్టబెడుతారు. ఆముసలాయన ఆస్తిపై కన్నేసి, "అతను చచ్చిపోయినా పెద్దనష్టమేమీ లేదుకదా? మా అమ్మాయికి డబ్బుకొరత ఉండదు కదా! ఆమె కొద్ది రోజుల్లో మాములుగమళ్ళీ తిండితినటం, నీళ్ళు తాగటం చేస్తుంది. నగలుపెట్టుకుంటుంది, మాములుగ బట్టలు కట్టుకుంటుంది, భర్తలేకపోతే ఏంపెద్ద నష్టమంట?" అంటారు. ఇలాంటి మాటలతో మేకనిపులికప్పజెప్పినట్టు సిగ్గులేకుండా ఆమెనప్పజెప్పేస్తారు. కానీ ఆమెకి అసలైన సంతోషం, ప్రాణమైన భర్తా, ఆమెని చక్కటి ఆభరణాలతో, దుస్తులతో నింపటంలో సంతోషించే వ్యక్తీ, ఆమెని తరచూ పొగుడుతూ, ప్రాణంతో సమానంగా చూసుకునే అతనేపోతే మిగిలిన ప్రపంచం ఆమెకి ఒట్టి అరణ్యమే కదా? వట్టిపై పై భోగాలతో ఆమెకి పనేముంది? పూర్వపు రోజుల్లో ఒకస్త్రీ భర్తతో సతీసహగమనం చేసేది-అదీ బాగానే ఉంది. ఆమె కూడా అతనితో బూడిదయిపోతే అన్నీ ముగిసి పోయేవి.

తల్లి తరువాత భర్తంతగా ఆమెనెవరూ ప్రేమించరనేది సత్యం. ఆ ఇద్దరూ పోయింతరువాత, ఆమెకి జీవితాన్ని నెట్టుకు రావటానికి బలం ఎక్కడి నుండి వస్తుందీ, అదీ యువరక్తపు నిప్పు కణికలు ఆమె హృదయంలో మండుతూ ఉండగా! డబ్బు కోసం అమ్ముకున్న ఆడపిల్లల గతి మరంతే!

కొంతమంది తమ కూతుళ్ళను రెండో భార్యలుగా చేస్తారు. కాని ఒక స్త్రీని రెండో భార్య అవటమనేంత ముల్లులా మరే ఆయుధం మనస్సులో గుచ్చుకుని బాధించదు. భర్త ఇంకో స్త్రీని కాస్త పరిశీలనగా చూసినా ఆమెరక్తం ఉడికిపోతుంది. అది ఊరికే చూడటం విషయం. ఇంక భర్త ఇంకో స్త్రీని పెళ్ళి చేసుకున్నా, లేకపెళ్ళి లేకుండా ఉంచుకున్నా అది ఇంట్లో అయినా, బయట అయినా ఆమె ఎలా భరించగలదు. ఇద్దరు స్త్రీలు ఒకే ఇంట్లో సంతోషంగా ఉండటం మీరెప్పుడూ చూడరు. బట్టలు, నగలూ విషయంలో వారిద్దరినీ మీరెంత సమానంగా అయినా చూడండి. కానీ మీరు ఒక్కరిని ప్రేమించినట్లు ఇద్దరినీ సమానంగా ఎలా ప్రేమించగలరు? ప్రేమనేది మామిడిపండో జాంపండో కాదు గదా ముక్కలుగా కోసి పంచివ్వటానికి. ప్రేమ పాల వంటిది. ఒక్కసారి పులిసిందా దాన్నెంత చిలికినా మళ్ళీ బాగు చెయ్యలేరు.

ఒకసారి విరిగి పోతే మళ్ళీదాన్ని కలపలేరు. నిజమే! మనుష్యులు కొత్త వస్తువుల్ని పాత వస్తువుల కంటే ఇష్టపడటం సహజమే, వాళ్ళు ఎవరైనా సరే! కానీ పురుషుడు తన భార్య ఎవరినైనా కాస్త శ్రద్ధగా గమనించినా, ఇంక అంతే, అతడు కోపంతో మండిపోవటం మొదలు పెడతాడు. ఇంక ఆమె కుటుంబం అవమానాల పాలవటం, ఆమెకి దెబ్బలూ, గదిలో బంధించటం, అవస్థలు పెట్టటం. ఇవేవీ మీకు అన్వయించవా?

మీరు మరి ఆమె ఒక చూపు చూస్తేనే సహించ లేక పోతే ఆమె గుండెలపై మండే కుంపటిని పెట్టుకుని భరించగలదా? మరి జనాలు తమ కూతుళ్ళని రెండో భార్యగా ఎందుకు పంపిస్తారు? ఎవరికైనా ఎక్కువమంది ఆడపిల్లలుంటే, వాళ్ళామెను ఎలాంటి మొగుడు దొరికినా అతనికి కట్టేస్తారు. అతడెలాంటి వాడైనా పరవాలేదు. కొంతమంది తమ కూతుళ్ళని తన కుటుంబాన్ని నాశనం చెయ్యగల మగవాడికి కట్టబెట్టేస్తారు. ఒక మగవాడు ఎంత అందవికారంగానైనా ఉండొచ్చు. దురలవాట్లతో, దయలేకుండా క్రూరంగా, అవతలి వాళ్ళని కొట్టటం, హింసించటంలో ఆనందం పొందేవాడు, కుటుంబానికి తిండీ తిప్పలు కూడా చూడనివాడై ఉండచ్చు. అయినా సరే జనాలు అలాంటి దుష్టులకి ఆడపిల్లల్ని ఆవుని కసాయివాడికి అప్పజెప్పినట్లు అప్ప జెబుతారు. అవన్నీ వర్ణించాలంటే ఒక పూర్తి బండెడు కాగితాలు కూడా సరిపోవిక్కడ. మరి ఆడవాళ్ళు ఇలాంటి వాటి వలన ఇల్లు వదలి పారిపోతున్నారంటే అది ఎవరి దోషం? తండ్రిదా కూతురిదా?

నిజానికి అన్నిటిలోకి గొప్ప సంతోషం పొందిన స్త్రీలు- అదే అనుకూలవంతుడైన భర్త గలవాళ్ళు, ముందుకి వెళ్ళి కేవలం నగలు, బట్టల కోసమే ఇలాంటి పాడు పనులు చేసేవాళ్ళు చాలా తక్కువమంది కన్పిస్తారు. బహుశ ఇప్పుడు మీరొక రాజుగారి కుటుంబం చూపించి అక్కడ సుఖః సంతోషాలకేమీ లోపం లేదుకదా అనొచ్చు. కానీ వాళ్ళు తమ స్త్రీలను తమ విహారాల్లో వెంట తీసుకెళతారా? రాజులతో, ఈ గొప్ప ధనవంతులతో ఏ పనైనా చేయించటం చాలా కష్టం. సంవత్సరంలో ఆరునెలలు వాళ్ళసలు తమ భార్యలను, రాణులను చూడను కూడా చూడరు. కనుక వాళ్ళకే సుఖాలూ లేవన్నమాట. వాళ్ళేం చెయ్యాలి మరి? వారి చుట్టూ భోజనాలూ, పానీయాలూ, సౌకర్యాలూ, సౌఖ్యాలూ అన్నీ నిండే ఉంటాయి. ఈ పువ్వులలాంటి మహిళలను మగవాళ్ళెలా వెనక్కి పట్టి ఉంచగలరు? అదెలా ఉందంటే "అమ్మ పెట్టదూ, అయ్య అడక్కోనివ్వడూ" అన్నట్లు. స్త్రీల పట్ల ఇంత ఉదాసీనత ఉన్నప్పుడు సహజంగానే వాళ్ళు పందుల్లా మురుగు తిరగ తోడుకుంటూ కూర్చుంటారు. ఇది ఒక ఉదాహరణ మాత్రమే. సత్యం చెప్పాలంటే మీ మగవాళ్ళ వల్లే ఆ స్త్రీలు చెడిపోతారు. వాళ్ళిలాంటి పనులు చెయ్యటానికి కారణాలేముంటాయి, మీరుఒకే భార్యకు గనుక కట్టుబడి ఉంటే. ఇంకో ఉదాహరణ తీసుకుందాం. కొంతమంది స్త్రీలు సర్వసుఖాలూ అనుభవిస్తున్నా భర్తలకి ద్రోహం చేస్తారు. ఇక్కడి పరిస్థితులేమిటి? ఆమెంత అద్భుతమైన స్త్రీయో పొగిడి పొగిడి, ఆమెపై మీకున్న మోహాన్ని గట్టిగా ప్రదర్శించి, ఆమె మీ రాణి, దొరసాని అనీ, మీరు ఆమె బానిస, జీతగాడనీ, బందీ అనీ ఆమె చెవిలో ఇల్లు గట్టుకుని మీరు పోరతారు. "నీ నుండి ఒకప్రేమతో కూడిన చూపు కోసం ఎదురు చూస్తున్నాను. ఒక్క చూపు కోసం పడి చచ్చిపోతున్నాను. నీ మెడలో దండనౌతాను, నువ్వేం చెయ్యమన్నా చేస్తాను. నీ కాళ్ళు నేలమీద మట్టిని కూడా తాకకుండా పల్లకీతో కూర్చోపెడతాను నీ చెప్పులు నా చేత్తో పట్టుకు తిరుగుతాను". ఇలా మీరుబ్రతిమాలి బామాలతారు. ఆమె మీ ఆశలురేపే అబద్ధాలన్నిటినీ తేనెలాగా జుర్రుకుని తాగేస్తుంది. ఇంకేం బుట్టలో పడిపోతుంది.

మరి మిగిలిన ఆడవాళ్ళు ఇలాంటి మాయలో పడి మోసపోవటం చూసిన ఆమె తనకెలాంటి కష్టాలు రాబోతున్నాయో ఊహించుకోకుండా బుట్టలో పడిపోతుందా అని మీరడగవచ్చు. అంతటి ఆత్మ నిగ్రహం ఉండాలంటే ఆమెకి దేవుడే ప్రక్కన ఉండాలి. కామమనేది అంత తీవ్రం అయింది కనుక.

కాదంటారా? మనం సముద్రమంత వివేకం ఉందనుకునే మనుష్యుల విషయంలో కూడా ఇదంతే! వాళ్ళు కూడా ధైర్యంగా విచిత్రమైన ఆలోచనలతో ముందుకు పోవటానికి ప్రయత్నించటం లేదా! మనం ఒకసారి జరిగిన తప్పు మరోసారి జరగని ప్రపంచంలోనే నిజంగా బ్రతుకుతుంటే ప్రభుత్వం జనాల్ని కారాగారాల్లో ఉంచి, తిండి పెట్టటానికి లక్షల కొలదీ డబ్బు వెచ్చించాల్సిన అవసరం వచ్చేది కాదు.

ఇంత పెద్ద దోపిడి దొంగలుమీరు, మెరుపుని కూడా మీ గుప్పిట్లో నుండి జారిపోనివ్వరు. పరాయివారి భార్య నెత్తుకు పోవటం మీకు ఒకపెద్ద లెక్కా. రెండుచేతులు కలిస్తే కాని చప్పట్లవవనుకోండి. అయినా కుడి చెయ్యే బలమైనది కదా!

కొంతమంది ధనవంతులు తమ కూతుర్లపై మమకారం మూలాన పేద కుటుంబాల నుండి వచ్చిన అబ్బాయిలకిచ్చి చేస్తారు. ఆ జంటని తమ ఇళ్ళలోనే పెట్టుకునే ఉద్దేశ్యంతో. ఇద్దరూ అమాయకంగా ఏమీ తెలియకుండా ఉన్నంత కాలం అన్నీ బాగానే జరిగిపోతాయి, కానీకొంత కాలానికి ఆమెకి కాస్త అనుభవం వస్తుంది. ఆమె గొప్పింటి బిడ్డ, సర్వసౌభాగ్యాలకీ అలవాటు పడ్డ ప్రాణం ఆమెది. చురుకుతనం, తెలివితేటలు గలది. ఆమెభర్తేమో తన జీవితాన్ని నిర్భాగ్యుడిగానే గడిపాడు అప్పటిదాకా! అతని తండ్రికి చురుకుతనమంటే ఏమిటో, సౌఖ్యమంటే ఏమిటో తెలియదు. ఆ కుర్రాడైతే సహజమైన తెలివితేటల వల్ల ఏవో కొన్ని విషయాలు చూసి నేర్చుకోగలుగుతాడు. కాని ఆ తండ్రికెలా తెలుస్తుంది ఆ భాగ్యవంతులు, హంగు గలవాళ్ళతో ఎలా మెసలుకోవాలో? అతడు పుట్టుక నుండి పేదవాడు, జీవితంలో కడుపు కింత శుభ్రమైన తిండి కూడా ఏనాడూ ఎరుగడు. మీరొక మామూలు గాడిదను పట్టుకుని రోజుకి రెండుసార్లు దాని వీపు రుద్ది, గంపల కొద్ది గ్రాసం పెట్టి, దాని వీపు మీద బంగారు వెండి జరీలతో పువ్వులు కుట్టిన గుడ్డవేసి, ఈకల టోపీ, దాని తోకకి వెండి జరీ కుచ్చులు కట్టచ్చు. ఇవన్నీ వేసింతరువాత కూడా అది ఒక బక్కచిక్కి శల్యమయి చావటానికి సిద్ధంగా ఉన్న ముసలి గుర్రం ప్రక్కనైనా గర్వంగా నిలుచోగలదా! ఇంకేం ఆమె అతనంటే అయిష్టం ఏర్పరచుకుంటుంది - అదెలాంటిదంటే పాత మురికి దుప్పటి ముక్కని చక్కటి ఉన్ని శాలువాపై మాటు వేసి కుట్టటం లాంటిదండీ. ఆ తరువాత జరిగేదీ అందరూ ఆశించేదే. అవన్నీ నేనిక్కడ చెప్పక్కరలేదు. జనాలు దీని గురించి నిత్యం నవ్వులపాలూ, అవమానాలపాలు అవటం మన కళ్ళతో మనం ప్రతి రోజూ చూస్తూనే ఉన్నాం కదా! ఒక తండ్రి తన ప్రేమను కూతురికి జీవితాంతం పనికి వచ్చేట్లు చెయ్యలేడా? ఆ తండ్రి మొదట్లోనే ఆమెకి అనుకూలవంతుడైన భర్తను చూచి వివాహం చెయ్యగలిగితే, వాళ్ళిద్దరూ సుఖసంతోషాలతో వృద్ధి చెందటం చూసి తానూ అమితానందం పొందేవాడు కదా!

మీకు ఒక పల్లెటూరి బైతులాంటి అంద వికారమైన భార్య, మురిగ్గా ఉంటూ, తగాదాలాడుతూ, తరచూ తన నీచ స్వభావం బయట పెట్టుకుంటూ ఉండే ఆమెతో ఉండటం ఇష్టముంటుందా? ఒక భార్య మాత్రం అలాంటి పరిస్థితి ఎందుకిష్టపడుతుంది మరి? మీకు మంచి భార్య కావాలని ఉన్నట్టే ఆమెకీ మంచి భర్త కావలని ఉండదా? మీ చిన్నప్పుడు మీ తల్లిదండ్రులు అడుక్కుతినే వాళ్ళంత పేదవాళ్ళయి ఉండచ్చు కానీ మీ పెళ్ళి విషయంలో వాళ్ళెంతో శ్రద్ధ తీసుకుని ఉండచ్చు. వాళ్ళు వేరే వాళ్ళ దగ్గర డబ్బు తెచ్చి, అప్పులపాలై, ఏదో తిప్పలు పడి మీ పెళ్ళి కుదిర్చి ఉండచ్చు. ఆ సమయంలో మీకు ఒక మంచి అందమైన పిల్ల దొరికే అవకాశమే లేకపోయి ఉండచ్చు. మీకు ఒక దిష్టి బొమ్మలాంటి పిల్ల దొరికి ఉండచ్చు. మీరు ఆమెనే ఒక దేవకన్య అనుకుని ఉండచ్చు. చదువులో వృద్ధిలోకి వచ్చి, ఉద్యోగంలో కొంచెం పైకి రాగానే, మీ మొదటి భార్యని చూస్తే మీకు అవమానకరంగా కూడా అన్పించవచ్చు. డబ్బు మీపై ప్రభావం చూపటం మొదలు పెట్టగానే, భార్య అంటే ఎంతలే అని మీకు మీరు చెప్పుకోవటమూ మొదలు పెట్టచ్చు. ఆడవాళ్ళకి ప్రతి నెలా కొంత డబ్బిచ్చి మిగిలిన పనివాళ్ళలాగే వంట చేసుకోవటానికి, ఇల్లు చూసుకోవటానికి ఇంట్లో

ఉంచుకుంటాం కదా! ఆమెని చూస్తే మీకిప్పుడు ఒక వెయ్యో పన్నెండొందలకో కొని మీ సొంతం చేసుకున్న ఆడబానిసలాగా అన్పించవచ్చు. మీ కన్నిటిలోకి ఇష్టమైన కుక్కనో, గుర్రాన్నో మీరెప్పుడైనా మీ భార్య కంటే ఎక్కువగా ప్రేమిస్తారు. మీ గుఱ్ఱాల్లో ఒకటి చచ్చిపోతే, ఇంకో గుఱ్ఱాన్ని తెచ్చుకోవటానికి కూడా పెద్ద కష్టపడక్కరలేదు మీరు. ఒక్కళ్ళు పోతే ఇంకొక్కళ్ళు వస్తారు. అదే పేదవాడైతే భార్యని కొద్దిగానైనా చూసుకుంటాడు. ఎందుకంటే ఒకామె పోతే ఇంకో ఆమెని తెచ్చుకోవటం అతనికి కష్టం కదా! కానీ ధనవంతులు అది కూడా చెయ్యరు. వాళ్ళకి అవకాశమంటూ వస్తే వారంలో ప్రతి రోజూ ఇంకొక కొత్తామెను పెళ్ళాడటానికి తయారుగా ఉంటారు. కాకపోతే యముడికి భార్యలని త్వరత్వరగా తీసుకుపోవటానికి తీరిక తక్కువ గనుక లేకపోతే ఒక్కరోజులోనే మీరు కొద్దిమంది భార్యలని ఒకరి తర్వాత ఒకరిని పెళ్ళాడేసేయగలరు. అవన్నీ వదిలేయండి కానీ ఆమె మీ భార్య అని చెప్పుకోవటానికి కూడా మీకు గొంతు పెగలదు. ఇంతకు ముందు మీతో మాట్లాడేప్పుడు ఎవరూ మర్యాదపూర్వకంగా మాట్లాడేవారు కారు. ఇప్పుడేమో అందరూ మిమ్మల్ని మీ అధికారం, డబ్బు చూసి అప్పా సాహెబ్ గారు, బాబా సాహెబ్‌గారు అంటున్నారు. ఇంకేం మీకు బ్రహ్మాండమైన ఆలోచన-మీ హోదాకు తగిన భార్య కావాలనిపిస్తుంది. మీరు మీ పెళ్ళి రోజు కోసం అసహనంగా ఎదురు చూడటం మొదలు పెడతారు. ఏ భార్యైనా భర్తని ఇలా చూడగలదా? మంచి రోజుల్లోనూ, చెడ్డ రోజుల్లోనూ గూడ మీ మాట తూచా తప్పకుండా పాటించి, మిమ్మల్ని సంతోషపెట్టాలని అనుకోదా! ఒక భార్య ఎప్పుడైనా "అతనికి డబ్బులేదు, అందవికారంగా ఉన్నాడు. ఇంకెవరితోనైనా నేను వెళ్ళిపోతాను అనుకుంటుందా?" ఎవరి పాపాలు నీచమైనవి, స్త్రీలవా? పురుషులవా?

ఇంక ఆరో అంశానికి వద్దాం. మనలో నిజంగా ఎవరు వందల సార్లు మోసాలలో మునిగి తేలుతున్నాం. మీరే ఇందులో మొదటి వారు. ప్రతి అడుగులోనూ మనకొక ఉదాహరణ కనబడుతుంది. మీరు వేసే వేషాలన్ని చూడండి, మీరు శరీరంపైన నలుపు పసుపు రంగుల చారలు వేసుకుని పులిగా కూడా మారిపోగలరు? మీరు గోసాయిలై పోతారు. ఫకీర్లు, హరిదాసులు, బ్రహ్మచారులు, సాధువులు, దుధాహరులు గిరిపురాలు, భారతీలు, నానకులు, కాన్ ఫుటేలు, జోగులు, జడధారులు, నగ్నమునులు వేషాలేసి ప్రపంచాన్ని వదలుకున్నట్టు కన్పడి, శరీరానికి బూడిదలు పూసుకుని, జుట్టు జడలు కట్టేలా పెంచుకుని, అరణ్యాల్లో జీవించటానికి వెళ్ళిపోయి ప్రపంచం మొత్తాన్ని మోసం చేసేస్తారు. వాళ్ళెవరెవరంటే ఒకరు రామగిరిబువా, మరొకరు శాస్త్రీ బువా, ఇంకొకరు గణపతి బువా ఫల్ టంకర్ పేరుతో గొప్ప సాధువుగా చలామణి అయితే ఇంకొకరు నానకపతి అవుతారు. ఏం గుణాలున్నాయి వాళ్ళందరిలో! మనమేమి చెప్పగలం? వాళ్ళ కవసరమైన సద్గుణాలున్నాయి, వాళ్ళు కొంత నిర్మోహత్వం సాధించారు, వాళ్ళు పవిత్రమైన మంత్రాలు కొన్ని చదువుతూ ఉంటారు. వాళ్ళు మనకేదైనా చెప్తే చాలు మనం నమ్మేస్తుంటాం. ఇంక మన స్వామికి పేరు ప్రఖ్యాతులు రాగానే, ఆయనకి మధురమైన పదార్థాలు ఆరగించటం అలవాటైపోతుంది. గండు పిల్లికి లాగా చక్కదనం, నిగారింపు వస్తుంది. ఇంక ఆయన మత కార్యాల గురించి మర్చిపోవటం మొదలు పెడతాడు. ఒక చోట కూర్చుని ఆడవాళ్ళు దర్శనం చేసుకోవటానికి వస్తుంటే, ఆయన వేరే జపమాల తిప్పటం మొదలు పెడతాడు. సరికొత్తగా యవ్వనంలో అడుగుపెట్టిన కన్యలను చూసుకుంటూ కూర్చుని ఈమె చక్కటిది, ఆమె అందమైందంటూ ధ్యానం చేస్తూ జపమాల తిప్పుతుంటాడు. ఇక శివుడు లేడూ హరీ లేడూ, అందరినీ మర్చిపోతాడు. ఇంక అతని పెదవులపైన కదలాడేది గోపిక రాధలా వుండే ఆ అందమైన యువతి పేరు మాత్రమే. అతని కళ్ళ కిప్పుడు కన్పించేది ఆ ముగ్ధ చక్కటి నవ్వు ముఖం మాత్రమే. లోలోపల ధ్యానం చేసేది డబ్బు గురించే. చూడ్డానికి మాత్రంపైకి అతడు పిచ్చివాడులా కన్పించినా అది గుంటనక్కకుండే పిచ్చి.

ఇలా వచ్చేదెవరో! ఆయన కాశీ నుండి వస్తున్న బ్రహ్మచారి. ఆస్వామి ఎంత రాజసం కలవాడంటే ఆయన్ని చూస్తుంటె సాక్షాత్తూ దేవుడే దిగి వచ్చి మన కళ్ళ ముందు ముకుళిత హస్తాలతో నిలుచున్న భావన వస్తుంది. ఒకసారి ఆయనతో వెనకేవేవి ఉన్నాయో చూడండి - ఒక పల్లకీ, ఒక బండి, ఒక డజను మెరికల్లాంటి గుర్రాలు, ఒక పదిమందో పన్నెండు మందో శిష్యులు- గుర్రాలంత చురుగ్గానూ, మెరుస్తూ ఉన్న కుర్రాళ్ళు. ఒకడేమో గంగాదాసునంటాడు, రెండోవాడేమో తాను రామప్రసాదునంటాడు. గంగాదాసుకి గురువుగారి భజనెలా చెయ్యాలో ఎవరూ చెప్పక్కరలేదు. మన మహరాజుకి నిజంగా భగవంతుని సాక్షాత్కారమైంది. కొంత కాలం క్రిందట. ఉజద్ గ్రామ పెద్దకి ఒక్క నలుసు కూడ సంతానం లేదు. అతనికి మన స్వామి ప్రసాదం ఇచ్చిన వెంటనే ఒక కొడుకు కలిగాడు. ఆ పిల్లవాడు నిజంగా అందరిలాంటివాడు కాడు. జబ్బుల బారిన పడి బాధపడేవాళ్ళు, దయ్యాలతో పీడించబడేవాళ్ళు ఎంతమందో ఆయన దర్శనం చేసుకుంటే చాలు అవన్నీ మాయమవుతాయి. ఆయనే శివుడి అవతారం." ఒకసారి ఒక వ్యక్తి ఇలాంటి మాటలు మాట్లాడిన తరువాత లోకానికేమీ ఆ మాటలు వ్యాపింప చెయ్యటంలో పాఠాలక్కరలేదు కదా! ముందొక ఈక గురించే తరువాత కాకి గురించి వాళ్ళు అలా అలా మాట్లాడుకుంటూ పోతూనే ఉన్నారు. ఇంకేం మన స్వామి బయట హంగు ఆడంబరాలతో విలసిల్లుతూ ఉంటారు. ఒక్కసారి లోపలికెవరైనా తొంగి చూడగలిగారా అక్కడ దివిటీల్లా వెలుగుతూ కన్పించేవి రెండు కోరికలు మాత్రమే - ఒకటి స్త్రీలు, రెండోది ఐశ్వర్యం.

అవును, నిజమే! మెడ చుట్టూ తులసి మాలలేసుకుంటారు, విఠలుని గుణాలు గానం చేస్తూ, హరిదాసుల్లా పైకి కన్పడుతూ, పేరు పొందిన అడుక్కునే వాళ్ళుగా తిరుగుతూ కాశీకి వెళ్ళిపోతారు. కానీ మీరు ప్రాయశ్చిత్తంగా అక్కడి కెళ్ళి గడ్డం, మీసాలు తీసేసినంత మాత్రాన అన్ని పాపాలూ కడిగేసుకోవచ్చుననుకుంటున్నారా?

మీరు మీ మీసాల నర్పించి, వాటిని భగీరధి నీళ్ళలో పారేసినంత మాత్రాన, మీలోని దుర్గుణాలన్నీ కట్టి కట్టి అలాగే వదిలించేసుకోవచ్చుననుకుంటున్నారా? అది జరిగే పని కాదు. పైగా మీరు గర్వాన్ని, మరిన్ని చెడ్డ కోరికల్ని సమకూర్చుకుంటారు. బయటకు చూడటానికి మాత్రం ఎంతో పవిత్రమైన వారిలా కన్పిస్తారు. కానీ భగీరధి జలాలైనా మీలో మండే మోసపు దివిటీని చల్లార్చగలవా?

కనుక మీరు సన్యాసం పుచ్చుకున్నారు అవునా? మరి ఆశల్ని, వాంఛల్ని జయించాలిగదా! మీరు మీకాషాయ వస్త్రాలతో, కర్రా, చేతిలో మర చెంబుతో తయారై-ప్రపంచమంతటినీ అందులో జీవాలనూ నారాయణుడితో సమానంగా ప్రేమిస్తూ, గౌరవిస్తూ ఉన్నారు కదా! కానీ మీరు గంగానది ఒడ్డున అందమైన రాతి మెట్లమీద స్నానం చేసి శుద్ధి చేసుకునేప్పుడు వీశెలకొద్దీవిభూతి మీ శరీరానికి రాసుకునేప్పుడు, అక్కడకూర్చుని పరమాత్మా శేషసాయీ శ్రీనారాయణా అనే నామం జపించేప్పుడు, ఒకచేతికి గోముఖం తగిలించుకుని జపమాల తిప్పేప్పుడు ఏమవుతుందో చూడండి! మీచెవులకి రేవులో మొట్టమొదటి మెట్టుపైన అడుగుల చప్పుడు వినబడగానే, మీకళ్ళు చురుగ్గా కదలుతాయి, చేతిలోని గోముఖం పడిపోతుంది, మన స్వామీజీలో గందరగోళం మొదలవుతుంది, నారాయణుడు అతని నోట్లో నుండి వెనక్కి తిరగి చూడకుండా పారిపోతాడు. ఇప్పుడొచ్చే నారాయణుడెలాంటివాడు? స్త్రీ రూపంలో వచ్చే నారాయణుడు, ఇప్పుడు ఆమె వెళ్ళి మన స్వామిగోముఖంలో కూర్చుంటుంది బయటకేమో కాషాయ వస్త్రాల్లో తిరుగుతుంటారు, లోపలేమో కుళ్ళిపోయేంత చెడ్డ ఆలోచనలు. లోపలేం జరుగుతుందో నిజంగా ఎవరు చూస్తారు? బిక్షగావేసిన డబ్బంతా కూడ గట్టడం, ఒక వేశ్య దగ్గరకు పరిగెత్తటం-అదే ప్రపంచాన్ని

విసర్జించటం అనే దానికి అర్థం ఇక్కడ.

దేవుళ్ళే ఆడవాళ్ళని నాశనం చేస్తూ ఉంటారు-ఇంకమిమ్మల్ని నమ్ముకుని లాభంలేదు. కృష్ణుడు అర్జునుణ్ణి ఒకమునిలా మారురూపంలో సుభద్రని తీసుకెళ్ళి పోవటానికి ప్రేరేపించినపుడు, యాదవకుమారులు "అత్తను ఒకమునే తీసుకెళ్ళిపోయాడని" ఒకళ్ళ కొకళ్ళు చెప్పుకున్నారు. కానీ మీరెప్పుడైనా ఒక అత్త మునిని తీసుకెళ్ళిపోవటం గురించి విన్నారా? ఆ రోజుల్లో రావణాసురుణ్ణి ఎదురొడ్డే మనిషే లేడు-అతడేమో మూడులోకాల్ని ముప్పుతిప్పలు పెడుతున్నాడు. ప్రతి చోటా మనుష్యులు దుఃఖిస్తూ గొణుక్కుంటూ ఉన్నారు. ఇంద్రపురం నిర్జనమైన తరువాత దేవతలు, రుషులు క్షీరసాగరంలో ఉన్న శేషసాయి భగవానుడి దగ్గరికి పాహిమాం అంటూ పరుగెత్తి వెళ్ళి, "స్వామీ, ఆరాక్షసుడుమమ్మల్ని హింసలు పెట్టి, బానిసలుగా చేసుకోకుండా కాపాడుమని" మొరపెట్టకున్నారు. సర్వశక్తి సంపన్నుడైన దేవుడు ప్రపంచాన్నంతా ఒక్కక్షణంలో పైకెత్తగలడూ, అలాగే నాశనం చెయ్యగలడూ, తాను కోరు కున్నట్లే. అంత అనంతశక్తి వంతుడి ముందు రావణాసురుడి బలమెంత? కానీ ఈ రోజుల్లో మనుష్యలలా అర్థంచేసుకోవటంలేదు. రావణుడు సీత నెత్తుకుపోయాడు గనుక వానరసైన్యం దక్షిణానున్న అతని రాజ్యంపై దండెత్తి నాశనం చెయ్యాల్సివచ్చింది-నిజానికదే గదా జరిగింది. కానీ ఇప్పుడు జనం ఏమంటున్నారో తెలుసా! "అపూర్వపు మాటలేమీ పట్టించుకోకండి, ఆనయవంచకే రావణుడి నాశనానికి కారణమయింది. ఈ నికృష్టులైన స్త్రీ లెంతకయినా తగుదురు, ఇళ్ళు రాజ్యాలూ నాశనం చేసేస్తూ," అని.

మరిమాకేం కలిసొచ్చిందిందులో! మళ్ళీ స్త్రీలదే తప్పంతా! సీత అగ్ని ప్రవేశం కూడా చేసింది. కానీ జనం ఆమెనీ తప్పు పట్టడం మానలేదు. అటు రామచంద్రుడందువలన గొప్పవాడైందీలేదు. ఎంత అద్భుతమైన దేవుళ్ళున్నారు మీకు? మీరెమో వాళ్ళకి నీడల్లాంటి వారు? వాళ్ళు ఒక్కరూపం లోనే కనబడతారు, మీరు రెండురూపాల్లో కనబడతారు. మీ ఈమోసాలగురించి మేమెలాచెప్పగలం? మీలో ఒకళ్ళు మరొకతనికి పైకి తమ్ముడిలా ప్రవర్తిస్తారు కానీ అంతరంగంల్లో అతని కేదో చెడుజరుగాలని ఎప్పుడూ కోరుకుంటూనే ఉంటారు, ఇంకోళ్ళు పైకిస్నేహితుడీలా కనబడుతూ ఉన్నా అతని కళ్ళు మాత్రం ఆస్నేహితుని భార్యనుండి కుక్కమీద దాకా ఆశగా తిరుగుతూనే ఉంటాయి. లోపలా బయటా కూడా స్వచ్ఛంగా ఉన్న మగవాళ్ళు చాలాఅరుదే! మీరు నలుగురైదుగురు ఒక చోట తయారవుతారు? తరువాతేమవుతుంది? "అదిగో అతణ్ణి చూడండీ, డబ్బు వెదజల్లుతూ ఉంటాడు బడాయికోసం. ఒక్కసారి అతడు దెబ్బతినటం చూడాలి." లేకపోతే "ఇతడున్నాడే, ఈరోజెంతఎదిగిపోయాడో, ఎంతాశ్చర్యం. ఒకప్పుడు కడుపునిండా తిండి కూడా లేనివాడు ఆలంజకొడుకిప్పుడు రెండు గుఱ్ఱాలబండిలో తిరుగుతున్నాడు." అదేమీపని-మీరొక కాకుల గుంపుల్లాంటివారు, బుర్రల్లో ఎప్పుడూ కుతంత్రపు ఆలోచనలు, మిగిలిన వాళ్ళలోని పైకి కనబడని తప్పులని బయటకిలాగి పొడుచుకు తింటానికి సిద్ధంగా ఉంటారు. మీరే చెప్పండి - మరి మట్లాడండి, ఆడవాళ్ళెప్పుడైనా ఈపనులు చేస్తారా? ఏస్త్రీ అయినా ఒకగోసాయి కానీ సాధువు కానీ వేషం వేసుకుని ఆ తరువాత ఒక మగవాణ్ణి తీసుకుని వెళ్ళిపోయిందా ఎప్పుడైనా? మీకు ఒక్క ఉదాహరణ కన్పించినా చూపించండిమరి.

స్త్రీలు సహజంగా ఆశపరులేకాకుండా అమాయకులు కూడా. ఎవరేం చెప్పినా నమ్మేస్తుంటారు. వాళ్ళు తమభర్తలనుండి పిల్లలు, ధనం, ప్రేమ పొందటానికేమేమి చేస్తారో చెప్పటం కష్టం. దీనికి ఉదాహరణేమిటంటే ఈ మధ్య వార్తా పత్రికలో ఒకస్త్రీ కథ వచ్చింది కదా! పిల్లల్లేని ఆమె ఒక మోసగాడైన పూజారిమాటలు విని ఒకచిన్న కుఱ్ఱవాడిది-నేనేమి చెప్తున్నాను మీకుతెలుసు-సంపాదించిబెల్లంతో కలిపి తింటే పిల్లలుపుడతారని నమ్మింది. మంచి అవకాశం చూసుకుని ఆమె ఆగొప్ప మందారగించింది. ఇంకేం

ఈ విషయం అందరికీ తెలిసిపోయి పెద్దపుకారయింది. ఆమె భర్తకీవిషయం తెలిసి ఒక కర్రపట్టుకుని దాంతో ఆమె వీపుమెత్తగా చితక్కొటే సరికి అందరిలో అవమానమయిపోతుందనే భయంతో ఆమె ఆత్మ హత్య చేసుకుంది.

ఒకవేళ ఆమెకి చదువు కనుక ఉండి ఉంటే ఆమె అటు వంటి కుతంత్రపుపనికి ముందుకెళ్ళేదా? ఎన్నోరకాల మోసగాళ్ళు-జోషీలు కాన్‌పూటేలు, బైరాగులు స్త్రీలకు వాళ్ళు భర్తలప్రేమ సంపూర్తిగా పొందగలుగుతారని, వారి భర్తలు పాదాక్రాంతులవుతారని నమ్మించిమోసం చేస్తూంటారు. "శనివారం రాత్రి, నిండుపున్నమి రోజు పిల్లలున్న ఇంటి వైపు చూసి నువ్వుదీపం వెలిగించుకుంటే మగపిల్లాడు పుడతాడు." లేకపోతే "ఒక అమావాస్యరోజు, శనివారం రాత్రి తలస్నానం చేసి విరిగిపోయిన కుండ నెత్తిమీద పెట్టుకుని, నగ్నంగా వెళ్ళి పదకొండుసార్లు హనుమంతుడి గుళ్లల్లో దర్శనం చేసుకురావాలి."స్త్రీలు ఇలాంటి అబద్ధపు మాటలువిని వాటిపైన వెంటనే గురికుదుర్చుకుంటారు. ఇలాంటి ఇంగితం లేని పనులు వాళ్ళు కొడుకులుపొందటం, భర్త ప్రేమను పూర్తిగా పొందటంపై ఆశలు పెట్టుకుని మాత్రమే చేస్తారు. మహిళల మనస్సులెంత తేలిగ్గా నమ్మే స్వభావం కలిగి ఉంటాయంటే వాళ్ళెలాంటి పనులైనా, ఎంత కష్టమైనవైనా వాటిలో వెంటనే దిగిపోతారు. దీన్ని బట్టే వాళ్ళెంత మూర్ఖులు, అజ్ఞానులో తెలిసిపోతుంది. వాళ్ళుకూడా మీఅంత చురుకైన వాళ్ళూ, తెలివైన వాళ్ళూ అయితే, వాళ్ళు కూడా మీలాగా సౌలభ్యాలూ సౌకర్యాలూ అనుభవిస్తూ ఇలాంటి పనులు చేస్తుంటే, మీరు వాళ్ళపై నేరారోపణ చేస్తే బాగుంటుంది.

ఇకపోతే మీరు ఆకర్షణ శక్తి గురించి మాట్లాడాలను కుంటున్నారా? స్త్రీలకాశక్తి తలనుండి కాలివేళ్ళదాకా పూర్తిగా ఉంది. వాళ్ళ ప్రతి అంగమూ, వాళ్ళ గొంతులూ, మాటా, నడకా, పనిచేసే తీరూ వాళ్ళ ప్రతి అడుగులోనూ ఇతరుల వాంఛలను మోసుకుంటూనే తిరుగుతుంటారు. కాని మగవాళ్ళు తేనె తుట్టె చుట్టూ కందిరీగల్లా ఆమెని చూడగానే మోహావేశంలో పడిపోయితిరుగుతూ ఉంటే అది ఆమె దోషమా!

మీరిదొకసారి ప్రయత్నించి చూడండి; ఒక పెద్ద వంటపాత్ర తీసుకుని, దానినిండా బంగారు నాణాలు నింపి దానిప్రక్కనే ఒక స్త్రీని నిలబెట్టండి. మీవెంట ఒక గొప్ప సాధువుని, ఒక బ్రహ్మచారిని తీసుకొచ్చి ఆయనకు చెప్పండి, "స్వామీ! మీకీరెండింటిలో ఏది ఎక్కువ నచ్చితే అది తీసుకోండి" అని. అప్పుడు చూడండి, ఆయన బంగారపు పాత్రను అవతలపారేసి వెంటనే మరో బంగారంకోసం, ఆ అందమైన స్త్రీ కోసం చేతులు చాచకపోతే.

ఇకపోతే ఏడవ అంశం - స్త్రీలే అన్ని పాపాలకు మూలం. ఏమాత్రం కాదు-అన్ని దుష్కార్యాలూ మీతో మాత్రమే మొదలవుతాయి. మీరు ధర్మాల్ని వదలి, మీచిత్తం వచ్చినట్టు ప్రవర్తిస్తూ, తాగి తందనాలాడుతూ, తమాషాల్లో వేషాలు వేసే కుఱ్ఱాళ్ళని చూసుకుంటూ, పేకాడుతూ ,గంజాయి తాగుతూ, ముండల్నుంచుకుంటూ అన్ని రకాల చెడ్డ, రోత పనులూ చేస్తూ ఉంటారు. మీరిది చెప్పండి అసలు వేశ్యంటే ఎవరు?... నిజానికి వేశ్యలనే వాళ్ళు మీరు మోసం చేసి ఇంట్లో నుండి తీసుకెళ్ళిపోయి వదిలేసిన వాళ్ళే! ఆమె మిగిలిన జీవులులా కాకుండా వేరేవిధంగా సృష్టించిన మరోరకం జీవి అనుకుంటున్నారా? వాళ్ళని సృష్టించింది వేరే దేవుడా? నిజానికి వేశ్యలనే వాళ్ళు మీరు మోసం చేసి ఇంట్లోనుండి తీసుకెళ్ళి పోయి వదిలేసినవాళ్ళే, ఏ స్త్రీనైనా తీసుకోండిమీరు. ఆమె ఇల్లే ఆమెకి వ్యధ కలిగించేదవచ్చు, ఆమెప్రాణానికే అపాయం కావచ్చు, ఆమె ఒక బోనులో చిక్కి ముందొక నుయ్యి వెనుకొకగొయ్యిగా ఉండి ఆమె ప్రాణాలే కోల్పోవచ్చు. కానీ ఆమె ప్రక్కన ఆధారం లేకుండా తనంతట తాను బ్రతుకలేదు ఆమె ఎంత ధైర్యవంతురాలైనాసరే. తన పెరట్లో నైనా సరే తన కాళ్ళపై తాను నిలబడలేదు. దానికి కారణం ఆమె బందీగా బ్రతకటంవల్లా, ఆమె

జీవితం ఒకే ఇంటిలోపల నాలుగు గోడలకే పరిమితమై పోవటం వల్ల, ఇంటిబయట ఎప్పుడూ అడుగుపెట్టి ఉండకపోవటంవల్ల. అందుకనే ఆమెంత సాహసవంతురాలైనా, సిగ్గుమాలినదైనా ఒకపురుషుణ్ణి వెంట తనంతట తాను పడదు. మీరే ఆమెకి మీ వాంఛల సంకేతాలిస్తూ, ఆమెలో లేనిపోని ఆలోచనలు రేకెత్తిస్తారు. ఒక సారి ఆమె వాటిని రుచి చూసిందా ఇంక అంతే! ఆతరువాత పాపమంటే ఏమిటో నేర్పటానికి ఆమెకి గురువు అక్కరలేదు.

అదెలాగంటే ఎవరైనా నల్లమందో, మద్యమో, వ్యాపారం మొదలు పెట్టినప్పట్లోలాగా. వాళ్ళు నిజమైన మద్యానికి ఏంకలపాలో, మద్యమెక్కువవటానికి ఏంకలపాలో, వాళ్ళ కెవరు అమ్మిపెడతారో, అమ్మేవాడిని ఎలాసంతోష పెట్టి మరింత సరుకెలా అమ్మించుకోవాలో-ఇవన్నీ నేర్చుకుంటూ సమయం వృధా చేయరు. ఇంతలో ఇంకో స్త్రీయో, పురుషుడో అదే వ్యాపారం లోకి వస్తారు. వాళ్ళు మొదటివాడెలా వ్యాపారం చేస్తున్నాడో చూసి నేర్చుకుని అదే విద్యలో వెంటనే ప్రవీణులయిపోతారు. ఏదైనా వస్తువు కొంచెం అమ్ముడు పోవటం మొదలు పెడితే, ప్రతి ఒక్కరు. అదే వస్తువు తయారుచేసినట్లన్నమాట. అయితే మొదట్లోనే ఎవరూ ఆపనికి ముందుకు రాకపోతే, ఎవరూ ఆవస్తువు తయారుచేసే వాళ్ళేకాదు. అదే పరిస్థితి వేశ్యల విషయం లోనూ అంతే. ఒకవేళ మీరెప్పుడూ వాళ్ళదగ్గరకు వెళ్ళ లేదనుకోండి, వాళ్ళకు వందలకొలదీరూపాయిలివ్వలేదనుకోండి, మీరు పెళ్ళిళ్ళలోనూ, వేడుకలలలోను, పాటలుపాడే పేరంటాలలోనూ, మిగిలిన సందర్భాల లోనూ వాళ్ళను అమితంగా గౌరవించలేదనుకోండి, లేకపోతే ఒక్కసారీ వాళ్ళవైపు సరదాగా చూడలేదనుకోండి, వాళ్ళింత వృద్ధి లోకి వచ్చే వాళ్ళా. వర్ధిల్లుతూ ఉండేవాళ్ళా. అసలు దీనికంతటికీ మీరే కారణం. ఒకవేళ స్త్రీలు ఇంట్లోనుండి బయటకి వెళ్ళిపోతే తామెలాబ్రతకాలా అని భయపడితే, వాళ్ళసలు ఇంటి బయట కాలు పెడతారా? ఇప్పుడు కనీసం ఒక విధంగానైనా సరే వాళ్ళకి తమ పొట్టలునింపుకునే అవకాశం ఉన్నదని తెలుసు. ఈ కారణాల మూలంగానే ఈ పని అంతవర్ధిల్లుతుంది. ఆవేశ్యలందరూ బయలుదేరే గూడు వేరే ఎక్కడో లేదు. మీరే ఇదంతా మొదలు పెట్టేది - ఆమెతో తియ్యటి కబుర్లు చెప్పి, ఆశలు రేకెత్తించి, ఆకర్షణతో ఆమెను గడప దాటించి, ఆమె ఇంట్లోనే ఆమెను పరాయిదాన్ని చేసేది. ఆమె నవ యవ్వనంలో ఉన్నంతకాలం ఆమెతో మీరు బాగానే కాలక్షేపం చేస్తారు. ఆమె ఆ ఆకర్షణ పోగొట్టుకుని పాడైపోయిన రోజున విధితో పాటు మీరుకూడా ఆమెని చిన్నచూపు చూస్తారు. అందుకే ఆమె ఈ నికృష్టమైన వ్యాపారం తన మనుగడ కోసం బహిరంగంగా మొదలు పెట్టటమే కాకుండా, మిగిలిన స్త్రీలను కూడా తనతో కలుపుకోవటానికి ప్రయత్నిస్తుంది. ఇదంతా మీరు ఈ అనుభవంతోనే చూడచ్చు. ప్రతి ఒక్కరూ ముల్లోకాలూ తమలాగే తయారు చెయ్యబడ్డాయి అనుకుంటారు. దొంగ కంటికి ప్రతి ఒక్కరూ దొంగే, అబద్ధాలాడే వాడికి ప్రతి ఒక్కరూ అబద్ధాలకోరే, ఒక వేశ్య దృష్టిలో ప్రతి ఒక్కరూ శీలం లేనివాళ్ళే. దీనికి విరుద్ధమైనది కూడా నిజమే! దయార్ద్రులు, పవిత్రులు, నిజాయితీపరులు, కరుణామయులు, కపటము తెలియనివారు, క్షమాహృదయం గలవారు - వాళ్ళంతా ప్రపంచమంతా తమలాగే ఉంటుందని కూడా అనుకుంటారు.

హస్తినాపురంలో పాండవుల గృహంలో రాజసూయయాగం చేసినప్పుడు శ్రీకృష్ణుడు దుర్యోధనుణ్ణి "వెళ్ళి ఈ గొప్ప రుషి సమాగమంలో నుండి ఒక్క యోగ్యుడైన వ్యక్తిని, నా చేతి నుండి బహుమతి అందుకో గల సద్గుణవంతుడిని చూసి నా దగ్గరకు తీసుకురా" అని ఆజ్ఞాపించాడు.

దుర్యోధనుడు సభంతా కలయ తిరిగి అందరినీ ఒక్కొక్కరిగా పరిశీలించి చూసి వాళ్ళందరూ తక్కువ గుణం కలవాళ్ళేననే నిర్ణయానికి వచ్చాడు. అతడు పరమాత్మ దగ్గరకు వెళ్ళి "ప్రభూ! వారందరిలో

ఒక్కడు కూడా నీ చేతి నుండి బహుమతిని తీసుకుంటానికి అర్హుడిగా లేడు. అందరూ మూర్ఖులు లేక కపటులుగానే ఉన్నారు అన్నాడు. అది విని పరమాత్మ ధర్మరాజుని కూడా అలాగే ఆజ్ఞాపించాడు. అతను కూడా అందరినీ చుట్టి నడిచి వచ్చాడు. "ధర్మరాజా! వీరెలాంటి వారంటావు? ఎవరైనా నా చేత బహుమతి తీసుకునే అర్హులున్నారంటావా?" అని భగవంతుడడిగాడు. ధర్మరాజు చేతులు ముకుళించి సమాధానం చెప్పాడు, "ప్రభూ! ఈ సభలో ప్రతి ఒక్కరూ సూర్యుడంత తేజోవంతంగానే వెలుగుతున్నాడు, అగ్ని అంత పవిత్రంగానే మండుతున్నాడు. అందులో ఒకరినెలా ఎన్నుకోను? నా కళ్ళకి ప్రతి ఒక్కరూ గొప్ప గౌరవ సత్కారాలకి పాత్రులే." ఈ పై విషయంలో కూడా అంతే.

మహిళలు అగ్ని గోళల్లా మండుతున్నారు, మీరు అందులో నూనె వేసినంత మాత్రాన వాళ్ళు తక్కువ కాంతితో మండుతారా? గుడ్డపై నూనె పోసి వెలిగించిన దివిటీ చుట్టూ పేది పురుగులుండి తీరతాయి కదా! ఆమెని మీపై మోహంతో వివేకం కోల్పోయేలా చేసి, భవిష్యత్తు పై ఎన్నో బంగారు ఆశలు కల్పించి, మీకు తోచిన పద్ధతిలో ఆమె ఇంటి బయటకు వచ్చేలా చేస్తారు. ఆ స్త్రీలలో ఒక్కరిని ఇదంతా నిజమేనా అని అడిగితే ఆమె కోపంలో చిరుతపులిలా పెదాలు కొరుక్కుని, మీ పేరు వినగానే పళ్ళు కొరుకుతుంది. దుర్మార్గం నుండి దుర్మార్గమే పుడుతుంది గానీ అది పెరిగి పెద్దవటానికి వేరే తోట లేదు కదా! బృందావనం చెట్టు చుట్టూ తీగలల్లుకున్నట్టుగా మీ దుర్మార్గం మిమ్మల్ని చుట్టుకునే ఉంటుంది కానీ మీరు మాత్రం దాన్ని ఆడవాళ్ళపై తోసేయటంలో ఘనులు.

'ఎవరినైనా తీసుకోండి'! స్త్రీలైనా పురుషులైనా, ఒకసారి రుచిమరిగారంటే వారు చెయ్యని దుర్మార్గం ఉండదు. మీరేదైనా దొంగిలించారనుకోండి అది తప్పుకోవటం కోసం అబద్ధాలు చెప్పాలి. అబద్ధాలని కప్పుకోవటానికి ఇంకా నీచమైన పనులు చెయ్యాలి, అది అలా ముందుకు పోతూనే ఉంటుంది. అందువలన అసలు మొట్టమొదటే మీరు ఆహ్వానిస్తున్నట్టు ఆమె వైపు చూపులు సారించకపోతే ఇదంతా అసలు జరిగేది కాదు గదా! ఇప్పుడు చెప్పండి స్త్రీల దుర్గుణాలేవైనా వీటికి దగ్గరగానైనా వస్తాయా? ఆడవాళ్ళెప్పుడైనా రోడ్డు ప్రక్కన నుంచొని ఆటలు పాటలు తిలకించటం, ఆడవాళ్ళు తాగి రోడ్డు మీద పడిపోవడం, ఆడవాళ్ళు జూదమాడటం, ఆడవాళ్ళు వందల్లో గుంపులుగా జేరి దోపిడీ దొంగలవటం ఎక్కడైనా చూశారా? వాళ్ళనెప్పుడైనా నల్లమందు కొట్లలో గానీ, ఇంకో మగవాడి ఇంట్లో బహిరంగంగా ప్రేమ కలాపాలు సాగిస్తూ గానీ చూశారా? వేశ్యల సంగతి వేరే, వారి విషయం వదిలెయ్యండి. అది వాళ్ళకి కడుపు నింపుకునే మార్గం; వాళ్ళు విటులు చెప్పినట్లాడకపోతే మరు రోజు వాళ్ళు పస్తు పడుకోవాల్సి వస్తుంది.

ఒక అదృష్టవంతుడైన మగవాడు రాసిన పుస్తకం స్త్రీ చరిత్ర అని ఒకటుంది. అది దుర్మార్గులైన స్త్రీల గురించే! కానీ ఆ కథలన్నిటిలో సత్యమెంతుంది? మీరెంత కష్టపడి ప్రయత్నించినా మీకందులో నిజ జీవితంలోని ఉదాహరణలు కన్పించవు. రాజకుమారిలను, రాణులను ఎంత జాగ్రత్తగా కాపలాలు కాసి, రాజప్రాసాదాల్లో కట్టి ఉంచుతారు! వాళ్ళు రాత్రి పూట మగ వేషంలో అంతఃపురాల నుండి పారిపోవటం సాధ్యమైన విషయమేనా? మహారాజు తప్ప ఏ మగవాడూ లోపలికి వెళ్ళటానికి, కనీసం మగ కుక్కని కూడా అనుమతించరు కదా. యాభైకి పైగా దిట్టమైన సైనికులు ద్వారం దగ్గర కాపలా ఉంటారు. సైనికులంతా గుడ్డి వాళ్ళేం కాదు గదా! లేక ఎలాగో చీకటి కమ్మేసి ఆ క్షణంలో వాళ్ళ కళ్ళని మూసేస్తుందా? ఒకరిద్దరి నోర్లైతే లంచంతో మూయించవచ్చనుకోండి. మరి ఒక పెద్ద గుంపు ద్రోహులున్నప్పుడు ఎవరో ఒకరు అరచి కేకలు పెడతారు కదా

నిజం చెప్పుకోవాలంటే ఐశ్వర్యంలో మునిగి తేలుతూ సులభమైన జీవితం గడిపే ఒక స్త్రీకి ఒక

గోసాయి కోసమో ఒక ద్వార పాలకుడి కోసమో అదంతా వదిలేసుకునే సాహసం ఎలా ఉంటుంది? ఎండ ముఖమెరుగని స్త్రీ, ఎప్పుడూ ఇంట్లో బందీగానే బ్రతికిన స్త్రీ, పరాయి పురుషుడి ముఖమెన్నడూ చూడని స్త్రీ? అంతా అసహజం - మీకు నిజ జీవితంలో అలాంటిదెప్పుడూ జరగదు.

హంసలు ముత్యాలు తిని బతుకుతాయి. ఒక సంవత్సరం పూర్తిగా ఆకలితో ఉండాల్సి వస్తే అవి మలిన పదార్థాలు తింటూ సంతోషంగా ఉండగలవా? ఒక నాట్యగత్తె వ్యభిచారం ఒక జీవన విధానంగానే భావిస్తుంది. ఆమెకి వచ్చే డబ్బే ముఖ్యం గానీ తానెవరితో పోతుందో అనేది ముఖ్యం గాదు. కాని ఒక వేశ్య కూడా ఒక రాజ ప్రాసాదపు ద్వార పాలకుడితోనో లేకపోతే కురూపియైన ఒక ముసలి యోగినో వరించదు. ఒక రాణి విషయంలో కూడా అదే నిజం కదా ! ఆ స్త్రీ చరిత్రలో కొన్ని కథలు ఎంత నికృష్టంగా ఉన్నాయంటే అవి చదవటానికి కూడా మనం సిగ్గు పడుతుంటాము. ఈ పుస్తకం చదివిన ఎవరికైనా రచయిత ఎంత తెలివి మీరిన దేశభక్తుడో సులభంగా అర్థమైపోతుంది.

ఈ ప్రభుత్వం హయాంలో విద్య త్వరగా విస్తృతంగా వ్యాప్తి చెంది ఎన్నో ప్రచురణ సంస్థలు స్థాపించబడ్డాయి. కనుక ఎన్నో చిన్న చిన్న పుస్తకాలు ప్రచురించారు. - మంజుఘోష అనే పుస్తకం, ముక్తమాల అనే పుస్తకం, మనోరమని గురించిన నాటకం మొదలైనవి ఉన్నాయి. ఒక పుస్తకంలో గానీ, నాటకంలో గానీ, శృంగారం, హాస్యం, దుఃఖం అనే మూడు వస్తువులుంటే గానీ దానిలో ఆనందముండదు. అది ఒప్పుకుంటాను కానీ ఒక రచయిత తాను రాసే ముందు ఆ కథ జీవితానికి దగ్గరగాఉందా లేదా, అలాంటి సంఘటనలెప్పుడైనా జరిగాయా లేదా అని ఆలోచించి ఆ తరువాతే రాయటానికి కూర్చోవాలి.

ముందుగా మంజుఘోష ని చూద్దాం. ఆమె ఒక గొప్ప చక్రవర్తికి ప్రియమైన పుత్రిక. అలాంటి ఆమె ఒక్కసారిగా వసంత మాధవుడితో కలసి రథంలోకి దూకి, తన ముసలి తండ్రిని మోసగించి, ఏమాత్రం ఆలోచన లేకుండా పారిపోతుందా? పైగా తనను చిన్ననాటి నుండి ప్రేమించి, గారాబం చేసి, పెంచిన తండ్రిని, ఆమంత తెలివి గలది, గుణవంతురాలు ఏమాత్రం ఆ రాజ కుమారుడెవరు ఎక్కడ నుండి వచ్చాడు లాంటి వివరాలు తెలుసుకోకుండా తమ వైభవోపేతమైన రాజప్రాసాదం, సౌఖ్యమైన జీవితం ఊరికే వదిలేస్తుందా! వెళ్ళేప్పుడు కనీసం తన ముసలి తండ్రి రూపమైనా ఆమె కళ్ళ ముందు కనబడదా? ఆమె ఏ భావాలూ లేకుండానే వెళ్ళిపోతుందా కనుక పాఠకులారా మీరే ఈ కథ జీవితానికి ఎంత దగ్గరగా ఉందో నిర్ణయించుకోవచ్చు. ద్వాపర యుగం ముగిసిన నాటి నుండీ ఇప్పటి కలియుగం మొదలయ్యే వరకు కొన్ని వేల వేల సంవత్సరాలు గడిచాయి. ఇంగ్లీషు రాజ్యం కూడా దాదాపు రెండు వందల యాభై సంవత్సరాల నుండి సాగుతుంది కదా! ఈ రచయిత కూడా ప్రస్తుత కాలంలోనే జన్మించి ఉండాలి. కనుక రచయిత తాతలు, నాతాతలు పది తరాల క్రిందట కూడా స్వర్గ రథం, వసంత మాధవుడి లాంటి దాన్ని, ఏనాడూ చూసి ఉండరు.

ఇంగ్లీషు వాళ్ళు ఎన్నో రకాల యంత్రాల్ని, రైళ్ళని, ఇంకా ఎన్నో విచిత్రమైన వాహనాల్ని, ఆకాశంలోకి వెళ్ళే వాటినీ తయారు చెసి ఉండవచ్చు. కానీ వాళ్ళు కూడా వాళ్ళు కోరుకున్నట్లు నడిచే రథాన్ని మాత్రం తయారు చెయ్యలేదు. కనుక వసంత మాధవుడికి మాత్రం అలాంటి రథమేదో దొరికిందని, అతడు దానిని మంజు ఘోషనెత్తుకుపోవటానికి వాడుకున్నాడనీ అనుకోవటానికి అవకాశం లేదు కదా!

రెండో పుస్తకంలోని ముక్తమాల కూడా ఒక పెద్ద కుటుంబంలో ఒక నాయకుని కడుపున పుట్టినామే. ఆమె భర్త రాజు గారి అభిమానం కోల్పోయి కారాగారంలో పడ్డాడు. అతన్ని చూడటానికి చేసే ప్రయత్నాలలో ఆమె దుష్టుడైన జైలు అధికారి భద్రక్షుడనే వాడి చేతిలో పడింది. అతడు ఆమెని అష్ట

కష్టాలూ పెట్టినా ఆమెను ఒక గాఢాంధకారమైన అడవుల్లో కట్టి పడేసినా, ఆమె తన స్త్రీ ధర్మాన్నెప్పుడూ వీడలెదు. రచయిత చెప్పిన మొత్తం కథా అదే. దానికి ప్రతిగా నెనెమంటానంటె ఒక స్త్రీ శక్తి ఒక పురుషుడి ముందు చీమలాంటిది. అతనికి ఒక చేతిలో ఆమె మొత్తం శరీరంలో ఉన్నంత శక్తి ఉంటుంది. కామంతో ఎగిసిపడే ఒక పులి జనసంచారం లేని ఒక పెరడులో కట్టి పడేసిన ఒక ఆవుని చూసిందనుకోండి - దాన్ని ఆ పులి ప్రాణాలతో వదలి పెడుతుందా?

మీ దేవుళ్ళు కూడా వంకర బుద్ధి కలవాళ్ళే, ఇంక మనుష్యులు దుష్టులైతే ఆశ్చర్యం ఏముందీ? ఇంద్రుడు గౌతముడి వేషాన్ని వేసుకుని మునిపత్ని అహల్య శీలాన్ని హరించాడు. చంద్రావళి గొప్ప పతివ్రతే అయినా కృష్ణుడు రాధి రూపంలో ఆమె నియమాల్ని భగ్నం చేశాడు కదా! మీరు పతివ్రతా ధర్మం గురించి ఇంత పెద్ద గొడవెందుకు చేస్తుంటారూ, అసలు ఇళ్ళనూ కుటుంబాలనూ నాశనం చెయ్యటానికి ఆలోచనలు చేసేది మీరే అయినప్పుడూ?

కృష్ణుడు దేవుడే, మంచి చెడూ కొలిచే త్రాసు ఆయన చేతుల్లోనే ఉంది కదా! అంతా తెలిసిన ఆత్మా రాముడాయన సత్యమేదో మోసమేదో తెలుసుకోగలడు. ఆయన స్త్రీలపై దయ తలచి, మీలో పాతుకుపోయిన తుచ్ఛ వాంఛలన్నీ నాశనం చేసి, వాళ్ళను మీ కబంధ హస్తాల నుండి విముక్తుల్ని చేస్తే తప్ప వాళ్ళకు స్వేచ్ఛ లేదు. లేకపోతే వాళ్ళ జీవితాలకేమీ లేదు. ఆ కథలన్నీ పుస్తకాల్లోన్నే నిజం. ఒక బ్రాహ్మణుడు పురాణాలు వల్లె వేసేప్పుడు వినేవాళ్ళందరికీ జాగ్రత్తలు వంకాయలో దోషముందనీ, తినకూడని పదార్థమనీ - వగైరా గట్టిగా హెచ్చరిస్తాడు. ఆయన పూజ పీట దిగగానే ఆ వంకాయల్ని ఎక్కడుండాలో అక్కడ పురాణాల్లోనే వదిలేస్తాడు. ఇంటికెళ్ళగానే అతను లొట్టలేసుకుంటూ వీశెల కొద్దీ వంకాయలారగించటం మీరు చూస్తారు. కనుక ఈ జ్ఞానమంతా మాటలకే పరిమితం కదా! దీన్నెవరు పాటిస్తున్నారీ రోజుల్లో. స్త్రీల ప్రమాణాల గురించెవరు పట్టించుకుంటున్నారు ఇప్పుడు. ఆమెకి విముక్తి ఎలాగంటే ఆమె దెబ్బ తిని పడిపోయి, ఒక దుష్టుడి పాదాల వద్ద పడి ప్రాణాలు తీసుకుంటే తప్ప మార్గం లేదు. ఆ కథలన్నీ రాయటంలో ఉపయోగమేమిటి? అది ఒక చిన్న పిల్లకి పెద్ద పెద్ద విషయాలు విశదీకరించి చెప్పటం లాంటిది. సాధారణంగా జరిగే విషయాలతో పోల్చి చూసినప్పుడు అవన్నీ ఎంత అభూత కల్పనలో మీకు సులభంగానే తెలిసిపోతుంది. ఇకపోతే మనోరమ నాటకం, నాటకకర్త దాన్ని నాలుగు వేరు వేరు కథల చుట్టూ అల్లాడు.

మొదటి కథకి సంతోషకరమైన ముగింపు ఎందుకుందంటే మనోరమ, గణపతిరావు ఇద్దరూ మంచి స్వభావం కలవాళ్ళు, చదువుకున్న వాళ్ళు. రెండవ కథ గోదూబాయి, రామ్రావు ఫడ్నీస్‌ల ఎంత అనుకూలంగాని దంపతులో, ఆ యువతి ముసలి భర్తని ఎంత చీదరించుకుందో, ఎంత చిన్న చూపు చూసిందో చెబుతుంది. ఆ తరువాత గోదూబాయి ఎలా ఇంట్లో నుండి భర్తనొదిలేసి పారిపోయిందీ, ఎలా న్యాయాధికారి తన పని తాను చేసుకుపోయాడో, పని మనిషి సరస్వతీ బాయి, మంగలివాడు తూక్యా ఇచ్చిన సాక్ష్యం మూలాన ఆమె న్యాయస్థానంలో అందరి ముందు ఎలా అవమానం పాలైందో వర్ణిస్తుంది. ఇక మూడో కథ గంగూ గురించి, నీచుడైన ఆమె భర్త వినాయకరావు గురించి. ఆమె సరస్వతీ బాయి వలన ఆకర్షింపబడి వ్యభిచారంలోకి దిగి, కరాచీ పారిపోయి, బహిరంగంగా వేశ్యగా మారిపోతుంది. ఈ కథ మనం ఒక వేశ్య చూపించే దయకి, ఆమె అంతస్తుకి, ఆమె తియ్యని మాటలకి, ఆమె బట్టలకి ఎంత వరకు విలువివ్వాలో ఆ తరువాత వాటన్నిటి ఫలితం ఏమిటో చెప్తుంది.

ఇంకపోతే నాలుగో కథలో రామ్‌భట్ అనే బ్రాహ్మణుడి విధవ కోడలు ధాకు. ఆమె గర్భవతై

కష్టాల పాలై, కిందా మీదా పడి బొంబాయి బాట్లీ వాలా ఆసుపత్రిలో చేరి అక్కడ పరమ నికృష్టమైన చావు పొందుతుంది. ఇవన్నీ ఆమెకి శారీరక సంపర్కం మూలంగా వచ్చి పడినాయి.

ఇంకేం రచయిత ఇలాంటి సంఘటనలన్నీ వెలుగులోకి తెచ్చాడు. కానీ ఇలాంటి నాటకం రాయటం వలన ఆయన తన తత్త్వమే బయట పెట్టుకున్నాడు. జనాలు అతడెందుకిలా చేస్తున్నాడో అర్థం చేసుకుని, అతన్ని చూసి నవ్వుకుంటున్నారు. ఒక సామెత ఉంది కదా, "గుప్పెడు మూసినంత కాలం మనుష్యులందులో లక్ష రూపాయలున్నాయనుకుంటారు" అని. నిజానికి ప్రతి ఇంట్లో ఒక మట్టి పొయ్యి ఉంటుంది, ప్రతి ఇంట్లో చీకటి వెలుతురు కూడా ఉంటాయి. ఒక సోదరి, ఒక తల్లి, ఒక కోడలు, ఒక బాల విధవ ప్రతి కుటుంబంలో ఉంటారా లేదా? మీరొక్కళ్ళపైన నింద వేస్తే అది అందరి పైనా పడదా? దీని మూలాన ఉపయోగమేమిటి? మనోరమ జీవితం లాగా అందరి స్త్రీల జీవితాలనూ మెరుగుపరచటంలో గానీ, లేక ప్రతి తల్లీదండ్రీ తమ ఆడపిల్లలకు ఈడూ జోడైన భర్తలని చూడటంలో గానీ ఈ పుస్తకం ఉపయోగపడిందా?

అలాంటివేవీ జరగవు కూడా. ఏ మగవాడూ తనకు తాను "నేను రామారావు లాంటి ముసలివాణ్ణి కదా, నేను గోడూబాయి లాంటి సాహసి అయిన పిల్లను పెళ్ళి చేసుకుంటే, అది న్యాయస్థానంలో వ్యాజ్యాలతో ఆమె నా పేరు ప్రతిష్ఠలతో ఆటలాడటం జరుగుతుంది. కనుక నేను ముసలితనంలో పెళ్ళి చేసుకోకూడదు అనుకుంటున్నాడా! ముసలి మగవాళ్ళు పెళ్ళిళ్ళు చేసుకుంటూనే ఉంటారు. సందేహం లేకుండా అది అవమానాలకే, బహిరంగంగా అయినా కాకపోయినా దారి తీస్తుంది.

నికృష్టులైన మగవాళ్ళని పెళ్ళాడినందువల్లే స్త్రీలు పారిపోతారని కూడా అనుకోనక్కరలేదు. అలా అయితే పనికిరాని వెధవల్ని చేసుకున్న ఆడవాళ్ళంతా ఇల్లు వదలి వెళ్ళిపోయుంటే ఈ రోజు ప్రపంచం విచ్చలవిడిగా తిరిగే స్త్రీలతో నిండి ఉండేది కాదా?

ఇకపోతే థాకూ కథకొస్తే ఆమె ఆసుపత్రిలో చనిపోవటం విచిత్రమేమీ కాదు - చావాల్సిన వాళ్ళు ఎక్కడున్నా ఇంట్లో అయినా బయట అయినా చావాల్సిందే కదా! నేను మీకు చెప్పదలుచుకున్నదేమిటంటే రచయిత గారూ మీ కథ స్త్రీలనీ పురుషుల్నీ మళ్ళీ ఏ తప్పులూ చేయకుండా భయపెట్టేస్తుందనుకోకండి.

ఒకవేళ దుష్టత్వానికి రూపమంటూ ఉంటే అది మీ పురుషులే అవుతారు. మరి స్త్రీలకి మీరేం చెప్తారు? నిజమే, ఎక్కడో ఒక అసహజమైన స్త్రీ, చాలా భయంకరపు పనులు చేసే ఆమె, మన పూర్వపు పేష్వా అత్త ఆనందాబాయి లాంటి వాళ్ళుండచ్చు, కానీ అలాంటి వాళ్ళు చాలా అరుదు. ఒక విజయలక్ష్మి లాంటి స్త్రీ తప్పు దోవన వెళితే ప్రతి స్త్రీనీ దోషిగానే చూస్తారు. కానీ సత్యమేమిటంటే ఆమెలాంటి వాళ్ళని మీరు వందలో పది మందిని కూడా చూడరు.

ఒకవేళ స్త్రీలు దుర్మార్గాలు చేసినా, వాళ్ళు మీకంటే మంచివాళ్ళే. మొట్టమొదట ఆమెని వలలో వేసుకోవటానికి, మీరు అన్ని రకాలైన పనులూ చేస్తారు. ఒకసారి ఆమె మీకు దక్కిందంటే, మిమ్మల్ని పూర్తిగా నమ్మి, తన మనఃపూర్వకంగా ప్రేమించటం మొదలు పెడుతుంది. ప్రపంచంలో అన్నిటి కన్నా ఆమెకున్న పెద్ద ఆభరణం, స్త్రీ ధర్మాన్నే, వదలి ఆమె మీకు జీవితాన్నర్పిస్తుంది. ఆమెకు మీరు చేసే కుతంత్రాలన్నీ ఎలా అర్థమవుతాయి? ఆ సమయంలో మీరు ఆమెకి బానిస లాగా ప్రవర్తిస్తారు, ఆమె మనస్సులో స్థానం సంపాదించుకుంటానికి ఆమె చెప్పులైనా మీరు నోట్లో పెట్టుకుంటారు, ఆమెపై మీరు తీవ్రమైన ప్రేమని కన్పరుస్తారు. కానీ ఎన్నాళ్ళు మీ ప్రేమ నిలుస్తుంది? వాంఛలు తీర్చుకునే వరకే గదా! మీ తుచ్ఛమైన

వాంఛలు తీరింతరువాత, ఆమె గర్భవతైం తరువాత, దుఃఖమూ, బాధ్యతలూ ఆమె పైన తోసేసి మట్టి పెళ్ళ అడ్డు వచ్చినప్పుడు ముఖం దాచుకున్న తేలులా, మీరు ఎక్కడో తల దాచుకుంటారు. పాపం జింక పిల్లలా, ప్రేత కళతో తెల్లగా పాలిపోయిన ముఖంతో, ఆమె పులి లాంటి ఆ మగవాణ్ణి ఏం చెయ్యమంటావని అడగటానికి వెళితే గౌరవానికి ప్రతీకను తానే అన్నట్లు సమాధానం చెప్తాడు. "మనమేం చేద్దామని అడగటంలో అర్థమేమిట? నువ్వే చేశావు. చేసిందానికి ఫలితం అనుభవించు" ఆమె ఏ ముఖం నుండైతే తియ్యటి వలపు మాటలు విందో, తానుదేన్ని చందమామ లాగా చూస్తూ ఉండిపోయిందో, దేని కోసమైతే తాను శరీరమూ మనసూ అర్పించిందో, దేన్నయితే ఆమె మనస్సు లోతుల నుండి ప్రేమించిందో, అదే ఆ ముఖమే ఇప్పుడు ఆమె హృదయంలోకి చొచ్చుకుపోయేలా బాణాల లాంటి మాటలతో బాధిస్తుంది. ఆమెకెలా ఉంటుంది?

కానీ పాపం ఆ స్త్రీ ఏమి చెయ్యగలదు? చివరకు నిరాశతో ఆమె అతన్ని వదిలేస్తుంది. పరువు నిలపుకోటం కోసం గర్భస్రావం చేయించుకొని, తాను చేసిన పనికి అన్ని రకాల ప్రాయశ్చిత్తం చేసుకుంటుంది. ఇంగ్లీషు రాజ్యం వీటన్నిటి గురించి చేసిందేమిటి? సాక్ష్యాలు లేకుండా వీటి గురించేమీ చెయ్యలేరు - కానీ ఇలాంటి సున్నితమైన విషయానికి సాక్ష్యులు దొరకరు కదా! ప్రభుత్వాన్ని కూడా ఈ విషయంలో తప్పు పట్టాల్సిందే అసలు. లంచాల విషయంలో అది ఒక్కసారి తీసుకున్న వాళ్ళను రెండు సార్లు ఇచ్చిన వాళ్ళనూ శిక్షిస్తుంది. ఈ విషయంలో కూడా కచ్చితమైన చట్టం చేసి, జంట ఇద్దరినీ శిక్షిస్తూ, స్త్రీని ఒక్కసారికి పురుషుణ్ణి రెండు సార్లకి శిక్షించవచ్చు కదా! పూర్వపు రోజుల్లో రోమన్లు, గ్రీకులు చాలా ఖండితమైన శిక్షలు వేసేవారు ఇలాంటి వ్యాజ్యాల్లో. కనుక ప్రభుత్వం ఈ సంగతంతా జాగ్రత్తగా పరిశీలించాలి. మగవాళ్ళు ఈ విషయం గురించి ఊరికే వదరుతూ ఉంటే, ప్రభుత్వం వాళ్ళనింకా శిక్షించి వాళ్ళ ముఖాలపై గట్టి పెద్ద ముద్ర వెయ్యాలి. దాంతో వాళ్ళ సోదరులందరూ భయపడిపోతే మళ్ళీ ఇంకో వ్యాజ్యం జోలికి పోరు. మరి ఆ దారిలేని మహిళ చాలా సాధువైపోయి, విధేయురాలై, కరుణ జూపమని ఏడుస్తుందీ, తన పాపాన్ని కన్నీళ్ళతో కడిగెయ్యాలని ప్రయత్నిస్తుంది. ఆమె తన దోషాలు మూటకట్టుకుని చెఱసాలకో ,ఇంకో చోటకో వెళ్ళిపోయి అందరి ఛీత్కారాలూ భరిస్తూ రోజులు గడుపుతుంది. కొంత మంది అబలలు తమ ప్రాణాలు తామే తీసుకుంటారు. మరికొంత మంది ఇల్లూ, వాకిలి, తమ కుటుంబాల్ని వదలి ఎక్కడికో దూరంగా వెళ్ళిపోతారు. మీకంటే పాములు కూడా మంచివే. మీరు పాముని చితక్కొడితే చచ్చిపోతుంది, కానీ మీ విషం శరీరంలో ఉండి దాన్ని నానా హింసలు పెట్టి, చివరలో అది మిమ్మల్నే చంపుతుంది. మరి పాముల కంటే భయంకరంగా మనుష్యుల్ని బాధపెట్టేది లాగే. మరి ఎవరివి, ఎవరి మనస్సులు పెద్దవి? మీరు స్త్రీల కోసం, వాళ్ళు మీ కోసం పడిన కష్టాలు పడగలరా?

మీ చేతుల్లో మాకలాంటి జాలి, కరుణ లాంటివెప్పుడూ దొరకవు. ఈ రోజు మీరు ఒక స్త్రీ జీవితాన్ని నాశనం చేస్తారు, ఆమెని ఊరు నుండి వెళ్ళగొడతారు. రేపు ఇంకో స్త్రీ వెనక పడతారు. మొదటామెని కల్లో కూడా గుర్తు చేసుకోరు. కానీ స్త్రీ ప్రేమ సముద్రమంత లోతైంది. తాను ప్రేమించిన వ్యక్తితోనే జీవితాంతం వరకు ఆ తరువాత కూడా అంటి పెట్టుకునే ఉంటుంది. అతను ఆమెని అడవుల్లోకి వెళ్ళగొట్టచ్చు కానీ ఆమె ఎప్పుడూ అతన్నే సమర్థిస్తుంది. స్త్రీల హృదయాలు మాత్రం ఆర్ద్రమైన ప్రేమతో నిండి ఉంటాయనేది నిజం.

స్త్రీల మూలాన నాశనమైపోయి ఇళ్ళలో నుండి వెలివేయబడ్డ మగవాళ్ళు చాలా తక్కువగా ఉన్నారు కానీ అలాంటి ఆడవాళ్ళు ఎంత మందున్నారో చెప్పలేము. మీరెంత నిర్దయులైన చతురులో,

ఎంత గొప్ప దోపిడీదారులో. మీరేమన్నా ఇంద్రయానిలో రాళ్ళలా ఆ దెబ్బ మాకే వచ్చి తగులుతుంది. మీరొక చెఱకు తోటలో నుండి నడచి వెళ్ళచ్చు కానీ అందులో ఒక్క ఆకు కూడా మీ శరీరాలను స్పృశించదు. మీరు రోజూ గొప్ప సభలు పెట్టి, ఉపన్యాసాలు దంచి, మిగిలిన వాళ్ళకి ఏం చేయాలో ఏం చేయకూడదో చెప్తుంటారు. మీ విషయంలో మాత్రం మీరు తెలివైన మూర్ఖులు. ఒక దివిటీ మిగిలిన వాళ్ళందరికీ వెలుతురు ప్రసాదిస్తుంది కానీ దాని వెనకే అంధకారం ఉంటుంది. మీరలాగే ఉంటారు, మీరే కనుక మీ దుష్టత్వాన్ని చూసుకోగలిగితే మీ గుండెలు పగిలి చచ్చిపోతారు.

మీరేమో మీ బుర్రల్లో ఉన్న తెలివి తేటలు కూడా ఉపయోగించరు. ఒక చోట నుండి ఇంకో చోటికి తిరుగుతూ అన్ని రకాల పుస్తకాలూ చదువుతూ ఉంటారు. ఎంతో విద్య నేర్చుకున్న మీరు ఏ పాత్రనైనా వెయ్యగలరు, ఏ ఇబ్బందిలో నుండైనా బయటకు రాగలరూ - ఇదంతా చాలా సులభంగా చేయగలరు మీరు. మరి పాపం ఈ స్త్రీలు, ఎప్పుడూ ఇళ్ళల్లో ఉండే వాళ్ళకేం లోకజ్ఞానం ఉందీ, వంటింట్లో పొయ్యికీ ద్వారబంధానికీ మధ్య వాళ్ళు నేర్చుకునేది తప్ప. ఇంకో విషయం ఏమిటంటే ఆడవాళ్ళు తిరుగుబోతులు కారు, మీలా ఎండిన చెట్టు మోళ్ళూ కారు. దేవుడు వాళ్ళపై జీవితపు భారాలన్నీ వేసెయ్యటం వలన వాళ్ళు తేలిగ్గా మోసపోతారు. మరి మనలో ఎవరు నిజానికి దుష్టత్వంలో మునిగి తేలుతున్నారు?

ఇకపోతే ఎనిమిదో విషయం - స్వర్గ మార్గాన్ని నాశనం చేసేవాళ్ళు, యముడి నగరానికి ద్వారం లాంటి వాళ్ళు. మీరిలాంటి బిరుదులిచ్చే స్త్రీలెవరు? మీరెవరి గర్భంలో ఊపిరి పోసుకున్నారు? ప్రాణాలు లాగేసే మీ భారాన్ని తొమ్మిది నెలలెవరు మోసారు? మిమ్మల్ని కంట్లో దీపంలా కనిపెట్టుకున్న దేవతెవరు? మిమ్మల్ని తన చేతుల్లో మోసి పెంచిందెవరు? పసి గుడ్డు నుండి పెంచి పెద్ద చేసిందెవరు? మిమ్మల్ని తన ప్రాణం కంటే ఎక్కువగా పోషించి కాపాడిందెవరు? ఇవన్నీ చేసిందెవరు, మీ తల్లి కాకపోతే? అనుక్షణం మీ మంచి చెడ్డలన్నీ చూస్తూ, మీరే తన సంతోషానికి గర్వానికి కారణం అనుకొని, మిమ్మల్ని అన్నయ్యా అని ప్రేమగా ఎప్పుడూ పిలిచిందెవరు మీ సోదరి కాకపోతే? ఇకపోతే మీ భార్య - కష్టసుఖాల్లో మీకు తోడుగా ఉండి, మీ లౌకిక జీవన రాజస్థానంలో ముఖ్యమంత్రిగా ఉంటూ, మిమ్మల్ని మనసారా ప్రేమించిన ఒకే వ్యక్తి ఆమే కదా! వాళ్ళంతా స్త్రీలే కదా, కాదంటారా? లేకపోతే వాళ్ళు వేరే వాళ్ళూ, వేరే జాతికి చెందిన స్త్రీలా? మీరు స్త్రీల గురించి మాట్లాడటం మొదలు పెడితే వాళ్ళందరి గురించీ మాట్లాడాలి మరి. మీరు స్త్రీలు గొడ్డళ్ళ లాంటి వాళ్ళనీ, అన్ని కుతంత్రాలకీ పాత్రలనీ, దుష్టత్వానికి సంతలనీ, స్వర్గ మార్గాన్ని నాశనం చేసేవారనీ అంటారు.

మీరు స్త్రీలని ఇలాంటి పేర్లతో పిలుస్తుంటే మేము మిమ్మల్నేమని పిలవాలంటారు? తల్లిని ద్వేషించే వాళ్ళనా? మాతృమూర్తి పైనే అపనిందలు వేసేవాళ్ళనా? మీరు సన్యాసం పుచ్చుకున్నా తల్లిని గౌరవించాలీ, ఆమె ఆజ్ఞలను పాటించాలి. పిల్లలకి ముగ్గురే దేవుళ్ళున్నారు - తల్లీ, దండ్రీ, గురువూ. పుండాలికుణ్ణి చూడండీ - తల్లిదండ్రుల కెంత సేవ చేసాడంటే భగవంతుడే అది చూడటానికి దిగి వచ్చాడు. ఈ రోజుకీ ఆయన అదే స్థానంలో నిలబడి ఉన్నాడు కదా! ఆయన ఇప్పుడు మీరు మీ తల్లులనెంత గౌరవిస్తున్నారో చూశాడు గనుక ఆయన శక్తంతా నిర్వీర్యమైపోయి, మీరు దగ్గర వెళ్ళి ఆయన కాలు విరగ్గొట్టినా, తన దివ్యమైన శక్తి చూపించలేని స్థితిలో ఉన్నాడు. ఆయన అలా శబ్దము, చలనమూ లేని స్థితిలో కూర్చుండిపోతాడు. ఆయన అద్భుతాలు చేసే శక్తి కోల్పోకపోయినా నికృష్టంగా తల్లిని ద్వేషించే వారి జోలికి పోయి, వాడి ముఖం చూడడు, అలాంటి వాడిని ముట్టుకుంటే స్వామి తాను, తాను వేసుకున్న

బట్టలతోసహా మడిస్నానం చెయ్యాల్సిందే. ఆయన దివ్య శక్తులే అలాంటి ఛండాలుడి అనుభవానికి వస్తే మైలపడిపోతాయి. పైగా ఆయనకు తెలుసుగా దుష్టులకి సరైన శిక్ష యముడి చేతుల్లోనే ఉంటుందని. దేవుడే అక్కడ క్షమాభిక్ష కోరాలి. బీర్బల్ కథలో చక్రవర్తి అతన్ని, "బీర్బల్ నువ్వు నాకిది చెప్పు, దేవుడెక్కడున్నాడు, ఆయనెక్కడ జీవిస్తుంటాడు, ఏం తింటాడు?" అని అడిగాడు. బీర్బల్ దానికి సమాధానంగా, "ప్రభూ! దేవుడు మీకు చాలా దగ్గరగా ఉన్నాడు. ఆయనెప్పుడూ నిజాయితీగా ఉండేవారికి దగ్గరగా ఉంటాడు. ఆయనకి ఆహారం సహనం, క్షమా అనేవి రెండే" అని చెప్పాడు. ఆయన ప్రపంచాన్ని గంభీరంగా గమనిస్తూ అందులోని సమస్త పాపాలనీ క్షమిస్తూ ఉంటాడని దాని అర్థం. అలా చెయ్యకుండా ఆయన చిన్నవీ పెద్దవీ ప్రతి దోషాన్నీ దండిస్తూ పోతే ఏమౌతుంది? వందల కొలదీ వేల కొలదీ ఆయన ముందుకి వెళ్ళే మీ సోదరులను అనుక్షణమూ విచారణ చేస్తూ ఒక రోజు గుమాస్తాగా, మరో రోజు న్యాయాధికారిగా, ఇంకో రోజు కారాగారపు అధికారిగా, మరో రోజు సిపాయిగా, సైన్యాధికారిగా వాళ్ళందరి కోసం సాక్ష్యులను కూడగడుతూ, మిగిలిన పనులవీ చేస్తూ గడపాల్సి వస్తుంది. ఆయనకు గొల్లభామలతో కాలక్షేపం చెయ్యటానికీ, రాధ, చంద్రావళి మిగిలిన గోపికలతో ఊసులాడటానికి సమయముండదు. అంతే కదా!

ఎవరైనా "అదిగో అతని తల్లి నరకానికి ద్వారం లాంటిది" అంటే మీకెలా అన్పిస్తుంది? లేకపోతే మీ అక్కని చూపించి, "అదిగో వాడి అక్క ,ఆమె కుళ్ళు కుతంత్రాలకి నిలయం" అంటే! లేకపోతే మీ భార్యని చూపించి "అతడున్నాడు చూశారా? అతడి భార్య సుగుణాల వృక్షాన్ని నరికేసే గొడ్డలి లాంటిది' ' అంటే. నువ్వు కిక్కురుమనకుండా కూర్చుని ఆ దూషణలన్నీ వింటావా. వోరి మూర్ఖుల్లారా! మీ తాతలే ఎవరూ స్వర్గాన్ని కళ్ళతో కూడా చూడలేదు కానీ మీరు అక్కడికెళ్ళిపోదామనే అనుకుంటున్నారా? మిమ్మల్ని స్వర్గంలోకి రానీయకున్నా సరే మీరొక్క స్త్రీకి కనుక ధైర్యం చెప్తే అదే మంచి పని. మీరు చేసే చెడ్డ పనులన్నిటికీ స్త్రీల కారణంగానే అనుకుంటే సరే దోషం వాళ్ళపైనే వేయండి. కానీ నిజానికి జరిగేది అది కాదు. మీరు చనిపోయే రోజు దాకా ఒక స్త్రీ ముఖాన్నే చూస్తూ ఉండండి, అయినా అది మిమ్మల్ని అసంతృప్తులుగానే మిగులుస్తుంది. మీలో ప్రతి ఒక్కరూ అలాగే, అదే దోషంతో ఉంటారు. అయినా మీరెన్ని ఆనందాలు అనుభవిస్తారు?

ఇకపోతే తొమ్మిదో అంశం - స్త్రీలే అన్ని రకాల మోసాలకీ నిలయాలు. మీరీ విషయంలో మిమ్మల్నే వర్ణిస్తున్నారేమో! మహాశయులారా! మీ అంత కుతంత్రాలు నిండిన వాళ్ళు, మీరు భూమిలో పాతాళం దాకా వెదికినా ఎవరూ కన్పించరు. స్త్రీలకు మీరంటే తమ ప్రాణాల కంటే ఎక్కువ తీపి అనేది కాదనలేరు కదా! ఒకసారి స్త్రీ మనసు ఎవరిపైనైనా లగ్నమయితే అదింక చలించదు. కానీ మీ మగవాళ్ళు పోతు టీగల్లాంటి వారు, ఒక పువ్వు నుండి వేరొక పువ్వు మీదకి తిరుగుతూ ఉంటారు. స్త్రీలీ విషయంలో ఎంత భిన్నంగా ఉంటారో మీరే ఆలోచించుకోండి.

మనసా వాచా మీరే సర్వస్వమనుకునే ఒక స్త్రీని ప్రక్కనే ఉంచుకుని మీ కళ్ళు రెండో ఆమె పై పడతాయి. మూడో ఆమెతో రాకపోకలన్నీ జోరుగా జరిగిం తరువాత, మీరు నాలుగో ఆమె వెనక పడతారు బ్రహ్మదేవుడు కూడా స్త్రీల జీవితాల గురించీ, పురుషుల భవిష్యత్తు గురించీ చెప్పలేరనీ ఎలా అంటారు మీరు, మీ మనస్సులే చాలా చంచలంగా ఉన్నప్పుడు? నిజానికి భగవంతుడు మనిషి పుట్టినప్పుడే అతని యోగము మంచిదో చెడ్డదో నుదుటన రాసేస్తాడు. దాంతో బ్రహ్మకేం పని. కుండలు చేసి వాటికి ఒక రూపమిచ్చేది కుమ్మరే కదా! మంచో చెడో ముద్ర వెయ్యటం నారాయణుడి చేతుల్లోనే ఉంది. ఒక్కసారి ఆ అక్షరాలు ఒకరి నుదుటి మీద రాసేశారంటే, దేవుడు కూడా వాటిని మార్చలేడు. మీరెవరు సత్యమేదో

చెప్పటానికి?

పాండవులు భగవానుడికెంతో ప్రియమైన సహచరులు. విరాటుని ఇంట్లో మారు రూపంలో ఉండి మరి వాళ్ళెందుకు ఊడవటాలూ, శుభ్రాలు చెయ్యటాలూ మొదలైన పనులు చేస్తూ ఉండవల్సి వచ్చిందీ? అర్జునుడు ఇంద్రుడి ప్రతిరూపమైన శంకరుణ్ణి కూడా యుద్ధంలో ఓడించేశాడు. మరైతే అతడు బృహన్నల రూపం ధరించి ఆడ పిల్లలతో అంతఃపురంలో సరస సల్లాపాలు జరపలేదా? ఆడవాళ్ళ జీవితాలిలాగే ఉంటాయి. కానీ స్త్రీలు మీలాగా ఒక వ్యక్తికి తమ చేయి అందిస్తూ ఇంకో వ్యక్తిని తన్నటం మొదలు పెట్టరు. ఒక స్త్రీ ఒక పురుషుడికి కట్టుబడే ఉంటుంది. కాకపోతే ఆమెకి తన మనస్సుకి సరిపోయే మనస్సు గలవాడు కావాలి. ఆమె ఎంత ఆరాట పడినా అతనలా లేకపోతే ఖాళీగా ఉన్న మనస్సుని ముళ్ళు నింపలేవు కదా! మరి మీరో - మీరు అవసాన దశలో ఉండచ్చు, కానీ మీరు ఎవరో ఒక స్త్రీని, ఆమెంత వికారమైన ముసలిదయినా సరే పట్టుకుని, ఆమే ఇంద్రుడి దగ్గర అప్సరస అన్నట్టు పట్టుకుని వేలాడతారు - తెలివైన మూర్ఖులు మీరు, నమ్మకద్రోహులు, స్నేహితుల్నే మోసం చేసేవాళ్ళు, రాజద్రోహులు. ఎలాంటి తిట్లయినా చెప్పండి అవన్నీ మీకు వర్తిస్తాయి.

మీ స్నేహితుడ్నే చూడండీ, మీతో ఎంత అమాయకంగా కల్మషం లేకుండా ఉంటాడు. అతనెదురుగా మీరు సౌమ్యంగా మంచిగా ఉంటారు. అతని అందమైన భార్య, అతని ఊపిరి, గృహలక్ష్మి, అతని గౌరవ ఖడ్గం వంటిది. కష్ట సుఖాల్లో అతని సహచరి, అతని ఐశ్వర్యానికి అధికారిణి, అతని హృదయపు వనంలో తీయని కుసుమం, దేవుడు శ్రమపడి అతనికి చేసిచ్చినంత లేత ఫలం. మీరెప్పుడూ సిద్ధంగా ఉంటారు దాన్ని మీరెప్పుడు దక్కించుకుని వలుచుకుందామా అని. ఇకపోతే ఒక జాగీరో, రాజ్యమో, దాన్ని దక్కించుకోవటానికీ, ఎవర్నో కిందకి లాగటానికి మీరు ఏమాత్రం సందేహించరు. కాని మీరింకా స్త్రీలు అన్ని కుతంత్రాలకీ నిలయాలనీ అంటూనే ఉంటారు. దారి దొంగల్లారా మీకు జేజేలు! ఆడదాని ప్రేమ కోసం నాశనమై పోయిన ఒక్క మగవాణ్ణైనా మీరు చూపగలరా?

స్త్రీల మూలాన ఎన్నో ఉపద్రవాలు జరగటం లేదా అని మీరడగవచ్చు. అవును జరిగాయి. ఎవరు కాదంటారు? కాని నిజానికందులో వాళ్ళు చేసిందేమిటి? మీరే రోజూ జాగీర్ల కోసం, వతన్ల కోసం, దేశముఖుల కోసం ఒక్కళ్ళనొకళ్ళు చంపుకోవటం, ఒక చిన్న పాటిల్ పదవి కోసం ఒకళ్ళకొకళ్ళు విషం కూడా ఇచ్చుకోవటం చేస్తుంటారు. దీనికి కూడా స్త్రీలే దోషులా? ఒకసారి న్యాయస్థానంలో వ్యాజ్యం పడిందంటే వందల వేల రూపాయలు ఖర్చు చేసి, అతి చిన్న పోలీసు కానిస్టేబులు కాళ్ళ దగ్గర కూడా పడిపోవటం - ఇవన్నీ ఎందుకు? మీరు చనిపోవటం జరిగితే ఈ అలసట అంతటి మూలానా లేక మీరు చేసే పాపాల మూలానా?

ఒకవేళ స్త్రీలే ఇటువంటి పాప కార్యాలన్నిటికీ పూర్తిగా కారణం అయితే వాళ్ళని నిందించటంలో తప్పు లేదు. అయినా సరే, మీ శరీరాన్ని స్త్రీకి అర్పించటం అనేది చాలా సహజమైన విషయమే - మీ శారీరక జీవితాన్నే కాకుండా, మీ పూర్తి జీవితాన్ని కూడా! దేవుళ్ళే స్త్రీల కిష్టమైన పనులు చేసి, సంతోషపెట్టటానికి ప్రయత్నించారు. వాళ్ళ ప్రక్కన మీరెంత? చెట్ల నుండి పడే ఆకుల లాంటి వారు. ఒక స్త్రీ అన్ని విషయాలలోనూ ఉన్నతురాలెందుకవుతుందంటే ఆమె అన్నిటినీ తన సంరక్షణలో ఉంచుతుంది కనుక, ఘనమైనవి తేజోవంతమైనవీ అన్నీ ఆమె కొరకే. ఒకవేళ స్త్రీలే కనుక లేకపోతే మీరు అడవుల్లో తిరుగుతూ, చెట్ల నుండి ఆకులు కోసుకుని తింటూ, దానితోనే విందులు చేసుకుంటూ కాలం గడిపేవాళ్ళు

దేవుడు స్త్రీలను సహజంగానే నాజూకుగా చేశాడు. అందుకే ఆమె కొరకే ఆయన ఈ పెద్ద పెద్ద ఇళ్ళు, ప్రాసాదాలు, మండువా ఇళ్ళు, ఉద్యానవనాలూ, ధన ధాన్యాలూ, చక్కటి దుస్తులూ, అనేకమైన సౌకర్యాలూ ఇవన్నీ చేశాడు. మీలాంటి తాడు బొంగరంలేని వాళ్ళని ఎవరు పట్టించుకుంటారు. చిన్నపిల్లలైనా, పిల్లవాళ్ళైనా కూడా పట్టించుకోరు. మీరు కావాలంటే ఒక చెట్టు క్రిందైనా తలదాచుకోవచ్చు. అది ఎవరికీ పట్టదు. కనుక ఆడదాని అర్ధశరీరంలో చాలా శక్తి ఉన్నదన్నమాట. మీ సగం శరీరం చచ్చుబడిపోతేనేం చేస్తారు ఒక చెయ్యితో జీవితం గడుపుకోగలరా? అది మాయ యొక్క గొప్ప శక్తే ఈ ప్రపంచాన్ని సృష్టించింది. స్త్రీ శరీరంలో ఆమె తన లాంటిదే ఒక చంచలమైన శక్తితో నింపిందీ, ఆమెనే భౌతిక జీవితం అనే బండిని లాగమని నియమించిందీ. మీ మగవాళ్ళకి ఒకటే పని ఉంది, అదేమిటంటే ఆ బండిని నింపటం, ఇంక ఆ బండిని సంరక్షించటం, ముందుకు నడపటం ఆమె చేతుల్లోనే ఉంది. స్త్రీలకున్న ఒకే ఒక శక్తి అది. ఆమె లేకుండా మీకు ఔన్నత్యం గానీ, సౌమ్యత గానీ, విజయాలు గానీ మరేమీ లేవు. నన్ను సూటిగా ఈ విషయం చెప్పనివ్వండి, ఆమె లేని ఇల్లు పాడుబడి పోయి మండుతున్న మైదానం లాంటిది. అన్ని ఐశ్వర్యాలూ నిండిన వైభవమైన రాజప్రసాదమైనా ఆమే దానికి నిండుదనం తీసుకు రాగలదు.

ఆమె తన ఇల్లేదనుకుంటుంధో, అది సగం కూలి రెండు నిట్టాళ్ళపై నిలిచిన గుడిసైనా, అది ఎంతో వెలుగు నిండిన గుడి లాంటిది. అందుకే జనం స్త్రీని లక్ష్మి అంటుంటారు. అందుకే ఈ విషయం గురించి మీరు జాగ్రత్తగా ఆలోచించాలి. బ్రహ్మ స్త్రీని విషం లాంటి తేనెగా, పురుషుల్ని వ్యామోహాల్లో బందీ చేసే దాని లాగా సృష్టించినందుకు నిందించే బదులు, మీరు కృతజ్ఞులయి ఉండాలి ఆయనకి. నిజానికి స్త్రీలు గోవుల కంటే కూడా నిస్సహాయులు.

ఆవుకి దేవుడు తనను తాను రక్షించుకోవటానికి శూలాల్లాంటి పదునైన కొమ్ములు, నాలుగు కాళ్ళు, దుప్పికున్నంత వేగం ఎందుకిచ్చాడంటే, పెద్దవైన పులి లాంటి క్రూర మృగాల నుండి తప్పించుకుంటానికి, కానీ స్త్రీకి అలాంటివి కూడా లేవు కదా!

దేవుడు మీక్కూడా అవి ఇవ్వలేదు - కొమ్ములూ, గుఱ్ఱంలా పరిగెత్తి పారిపోవటానికి నాలుగు కాళ్ళూ వగైరా! ఆయన మీకిచ్చిందేమిటంటే గొప్ప తెలివి తేటలు - విశ్వంలో ఉన్న జీవులన్నిటిలో మిమ్మల్ని ఉన్నతమైన వాడిగా, శ్రేష్ఠుడిగా చేశాడు. కాబట్టి మీరు మీ ప్రవర్తనలో ఆ గౌరవ స్థితికి తగినట్టు మసలుకోవాలి. కానీ అది అత్యాశే అవుతుంది కాదంటారా? ఇంక మీ బ్రహ్మదేవుడి విషయానికొస్తే ఎంత ఉన్నతుడై ఉండాల్సిన ఆయన, ఆయన గురించేం చెప్పగలం! ఏ తరహా పవిత్రుడైన మనిషి ఆయన? ఆయన మీకంటే అధముడు.

భిల్ల స్త్రీల వెనక పరిగెత్తటానికి శివుడు ప్రాయశ్చిత్తం వదిలేశాడు. విశ్వామిత్రుడు అదే కాకుండా కుక్క రూపంలోకి మారిపోయాడు - అప్పట్నుండీ ఆయన మిమ్మల్నందర్నీ కూడా కొంచెం కుక్కల్లా చేస్తున్నాడు. ఎంతో మంది దేవుళ్ళ పేర్లు మీరు చెప్పకోవచ్చు - చంద్రుడు, ఇంద్రుడు ఈ అందరూ - వాళ్ళ ప్రక్కన మనుష్యులు సాటిరారు.

అందుకని మీరు మొట్టమొదట మీ మనస్సులని చెట్టు మొదలంత బలం గల మీ వివేకానికి కట్టివేసి, భీష్ముడిలాగా ప్రవర్తిస్తామని ప్రతిజ్ఞ తీసుకోండి. మదపుటేనుగు లాంటి మీ వాంఛలు అరటి తోపుల్ని తొక్కేసి, నాశనం చెయ్యకుండా కాపాడండి. మీరు ముందు మంచితనంతోనూ, నిజాయితి తోనూ ప్రవర్తిస్తూ ఆ తరువాత స్వచ్ఛమైన పతివ్రతా ధర్మమనే జండా ప్రపంచంలో ప్రతి ఇంటిపై ఎగరవెయ్యాలి

- ప్రతి ఇంటిలో సంతోషం, ఉల్లాసంతో నిండిన తృప్తిని అందించే జండా! అప్పుడు తలెత్తి చూడండి, చందమామ కూడా దాని ప్రక్కన పాలిపోయినట్టుండదా!

అయినా నేనిక్కడ స్త్రీలకి వాళ్ళకి తోచిందంతా చేసే పరిధులు లేని స్వాతంత్ర్యముండాలని అస్సలనటం లేదు.

వాళ్ళంతా చదువుకోని వాళ్ళు, అజ్ఞానులు, బలహీనులయి ఉండచ్చు. అయినా సరే వాళ్ళు బలం తెచ్చుకుని, తాము మర్యాదగా ప్రవర్తిస్తామని గట్టిగా నిర్ణయించుకుని, లోపలా బయటా అగ్నిలా పవిత్రంగా ఉంటామనుకొని, మగవాళ్ళు సిగ్గుతో తమను చూసి కళ్ళు దించుకొనేట్లు చెయ్యాలి. ఇవన్నీ కాక, వాళ్ళకి గొప్ప ఆభరణమేమంటే లక్ష్మి అనే పేరుకి తగ్గట్లు బ్రతకటం. అలా ఉండాలని నేను ఉన్నతుడైన భగవంతుణ్ణి, అన్నీ నిర్ణయించేవాడిని, శాశ్వతుడైన వాడిని, నిజమైన దయార్ద్ర హృదయుడైన ఆయన్ని, కరుణా సముద్రుణ్ణి, క్షమా సముద్రుణ్ణి, పేదల సహోదరుణ్ణి ప్రార్థిస్తున్నాను. స్త్రీలు పతివ్రతా ధర్మము వలన తమ అత్తిళ్ళల్లోనూ, పుట్టిళ్ళల్లోనూ మెరుపుల్లాగా మెరిసిపోవాలని ప్రార్థిస్తున్నాను. ఆనందపు జెండా వాళ్ళ రెండు వైపుల గృహాలయాల పైకి ఎగరాలనీ, లక్ష్మి కీర్తితో అందరు స్త్రీలూ, పిల్లలూ సంతోషంగా ఉండాలనీ, అందరూ స్త్రీలను ప్రేమించాలని, వాళ్ళ నుదుట అయిదవ తనపు చిహ్నాలు నిండి ఉండాలనీ ప్రార్థిస్తున్నాను. ఈ ప్రపంచంలో అందరి స్త్రీల జీవితాలూ సాఫీగా సాగిపోవాలనీ, అందరు స్త్రీలూ ఈ లోకంలోనూ పైలోకంలోనూ కూడా సంతోషం పొందాలనీ ప్రార్థిస్తున్నాను. ఇలా భగవంతుణ్ణి మనస్ఫూర్తిగా ప్రార్థిస్తూ ఆయన కుశలం కోరుకుంటూ ఈ పుస్తకం ముగిస్తున్నాను.

1. **చంద్రావళి** : గోపికలకు నాయకురాలు, వారిలో ముఖ్యురాలు.

2. **పోతీలు**: ఒక్కొక్క ప్రాంతానికి చెందిన పురాణగాథలు

3. **శ్రీధరస్వామి** : పాంధారపూర్‌కు చెందిన పదహారవ శతాబ్దపు బ్రాహ్మణుడు. ఆయన రామవిజయ, పాండవప్రతాప అనే పేరుతో మరాఠీ రామాయణం, భాగవతం రాశారు.

# మరోమాట

దాదాపు 1800వ సంవత్సరాంతంలో ఒక విధవరాలు గర్భవతైందని పుకార్లు విని, ఒక పోలీసు దక్షిణ గుజరాత్‌లోని సూరత్ దగ్గరున్న ఓలవాడ్ అనే చిన్న గ్రామానికి వెళ్ళాడు. విజయలక్ష్మి అనే ఆ ఇరవై నాలుగు సంవత్సరాల విధవరాలు ఒక బ్రాహ్మణ కుటుంబంలో పుట్టిందని తెలుసుకున్నాడు. తాను విన్న విషయం నిజమేనని నిర్ధారించుకున్న తరువాత మున్ముందు ఆ స్త్రీ బిడ్డను రహస్యంగా వదలించుకోకుండా ఉండటం కోసం విషయాన్ని (జిల్లా) మేజిస్ట్రేటుకు నివేదించాడు. అయితే తరువాత 1881 మార్చిలో ఒక పెంట కుప్పలో అప్పుడే పుట్టిన పసిబిడ్డ శవం దొరికే వరకూ, ఆ పోలీసు మరేమీ చేయలేదు. ఆమెను అప్పుడు అరెస్టు చేసి సూరత్ తీసుకెళ్ళారు. ఆమె రెండో తరగతి మేజిస్ట్రేటు ముందు తాను ఒక బిడ్డకు జన్మ నిచ్చినట్లూ, సంఘంలో తలవంపులు రాకుండా ఉండేందుకు ఆబిడ్డను వంటింట్లో వాడే కత్తితో గొంతు కోసి చంపేసినట్లూ ఒప్పుకుంది. 1881లో సూరత్ సెషన్సు కోర్టులో ఆమెను విచారించిన జడ్జి ఉరిశిక్షవేశాడు. తరువాత బొంబాయిలో అప్పీలుకోర్టులో ఆమెని మళ్ళీ విచారించి గొప్ప బహిరంగ సంచలనం మధ్య శిక్షను దేశ బహిష్కారానికి తగ్గించారు.

విజయలక్ష్మికి పట్టిన అవస్థ పందొమ్మిదవ శతాబ్దంలో ముఖ్యంగా బ్రాహ్మణ కుటుంబాల్లోనూ, హిందువుల్లో మిగతా అగ్ర కులాల్లోనూ అసాధారణమేమీకాదు. ఈ స్త్రీలు యవ్వన దశలో అడుగుపెట్టకముందే వాళ్ళకు పెళ్ళిళ్ళు చేసి, ఆ తరువాత వాళ్ళు వైధవ్యం పొందితే వాళ్ళు సన్యాసులంత పవిత్రంగా ఉండాలని ఆశించే వాళ్ళు. ముఖ్యంగా విజయలక్ష్మి వ్యాజ్యం, ఆమెకి వచ్చిన చెడ్డ పేరూ, పత్రికల్లోనూ బహిరంగగానూ ఆమెపై చెలరేగిన దుమారం తారాబాయి అనే మరో స్త్రీ సహనానికి ఆఖరిమెట్టై, ఆవేశంగా ఆమె కలంపట్టి ఇవన్నీ ఎదిరించేందుకు దోహదం చేసాయి. ఆ సమయంలో విజయలక్ష్మి పైనా ఆమె చేసిన పని పైనా ధారుణంగా స్త్రీలపైన ఉన్న అభిప్రాయాలుగా. ఆమె జీవితకాలంలో మరింత పాతుకు పోయిన వైఖరులుగా తోచాయి. ఫలితంగా ఆమె పురుషాహంకారానికి సవాల్ అనే పుస్తకాన్ని ప్రచురించారు. ఆమె గ్రంథం మరాఠీలో అచ్చులో 52 పేజీలుంది. పూనాలు ప్రచురించిన ఈ పుస్తకం వెల 9 అణాలు.

తారాబాయి రచనను (బానిస) పరతంత్ర పరిపాలనలో వున్న భారతదేశంలో మొట్టమొదటి ప్రధానమైన స్త్రీవాద భావాల వ్యక్తీకరణగా భావించవచ్చు. ఆమె మానవాళినంతటినీ దృష్టిలో పెట్టుకుని రాసే పద్ధతి మహారాష్ట్రలోని భక్తి సాహిత్య సాంప్రదాయంలో పుట్టినది. మహాత్మా, పూలే లాగా ఆమె కూడా మానవులందరి తరుపున వారిలో ఒక దానిగా మాట్లాడుతుంది. కనుక ఆమె రచనా కథనము ఒక సాంఘిక కథనంగా తరుచు ప్రేమ, మానవ బంధాల చర్చలతో సాగుతుంది. ఆమె దృష్టి ఎక్కువగా స్త్రీల అణిచివేత పైనేఉన్నా, స్త్రీ పురుషులు పరస్పరాధారంగా జీవిస్తారనేది కూడా ఆమె అంగీకరించింది.

తారాబాయి పుస్తకం 1882లో, స్త్రీలను వ్యక్తులుగా అంగీకరించి, వారి ఆలోచనలనూ అనుభవాలనూ చిత్రీకరిస్తూ మరాఠీలో వచ్చిన ఒక పుస్తకాల పరంపర తరువాత వచ్చింది. ఆమె పుస్తకం, అందులోవాడిన పదాల ఎంపిక, శైలీ, వాదించిన, విధానం చూస్తే ఆరోజుల్లో పూలే

నడిపించిన సత్యశోధక వాదముతో ఆమెకు దగ్గర పరిచయం ఉన్నట్లు తోస్తుంది. ఆమె భాష పదనుగా, ధృడంగా ఉండి, మరాఠీ నుడికారంతో, సామాన్యుల నోటి మాటలా ఉండి, ఎన్నో పుస్తకాలనూ పురాణాలనూ చర్చిస్తూ, వ్యంగ్యంతో చురకలు వేస్తూ ఉంటుంది. ఆమె పుస్తకంలోని శక్తివంతమైన భాష పురుషాధికార, స్వచ్ఛతావాద కట్టుబాట్లకు, నీతిసూత్రాలకూ లొంగి ఉండలేదు.

తారాబాయి పశ్చిమ భారతదేశంలోని శ్రీమంతులైన మరాఠా రైతు కుటుంబం-(ఆంధ్రలో రెడ్ల లాంటి వారు-)లో పుట్టింది. బ్రిటిషు కాలంలో భారతదేశంలో కొత్తగా బలంపుంజుకున్న మిగిలిన సాంఘిక సమూహాల్లాగే, పెద్ద కులాల్లానే, ఈ మరాఠీలు రెండు శతాబ్దాలక్రితం మొగల్ అధికారాలు అంతమైపోతున్నప్పుడు పల్లెప్రాంతాల్లో ముందడుగు వేసి తమ పట్టు బిగించిన వాళ్ళలో ఒకరు. అప్పట్లో ఈ 'మారాఠా' అనే పదమే కొద్దిగా ఉన్న శ్రీమంతుల కుటుంబాలూ, చదువుకున్న వాళ్ళూ, స్వేచ్ఛగా రాజరికాన్ని దానితో కూడిన క్షత్రియుల అంతస్తూనూ, ఆశించిన వాళ్ల పరంగా మాత్రమే ఉపయోగించేవాళ్ళు. మిగిలిన ఎంతమంది మధ్య తరగతి రైతులను కున్బీలని పిలచేవాళ్లు. మిగిలిన పరతంత్ర భారతదేశంలో వ్యవసాయ కులాల్లాగే మరాఠా, కున్బీ కులాలమధ్య బేధాలు కఠినంగా ఉండేవి కాదు. వ్యవసాయం స్థిరంగా ఏర్పరచుకున్న తరువాత వాళ్ళ మధ్య వివాహ బంధాల ద్వారా ఒకరితో ఒకళ్ళు కలిసిపోయేవారు.

తారాబాయి రాసిన ఈ ఒకే ఒక్క పుస్తకం 1881-82 మధ్యకాలంలో రచించినా, ఆమె 1905 దాకా జీవించి ఉన్నట్లు ఆమె సమకాలీకుల్లో ఒకరికి గుర్తుంది. కనుక ఆమె ఎక్కువగా పందొమ్మిదవ శతాబ్దం రెండవ భాగంలోనూ, కొంత ఇరవైవ శతాబ్దం మొదట్లోనూ కూడా జీవించి ఉండాలి. ఆమె కుటుంబం మహారాష్ట్రలోని ఒక చిన్న పట్టణం బుల్దానాలో ఉన్న నాలుగు పెద్ద కుటుంబాల్లో ఒకటి. నగరం బయట వారికి భూములున్నా, ఆమె తండ్రి హరిషిందే బాపూజీ నగరంలో డిప్యూటీ కమిషనర్ ఆఫీసులో హెడ్ గుమాస్తాగా ఉండేవారు. అయిదుగురు సభ్యులున్న కుటుంబంలో ఆమె ఒక్కతే ఆడపిల్ల అవటం వలన తండ్రి ఆమెని గారాబంగా పెంచాడని ప్రతీతి. మహాత్మాపూలే 1873లో స్థాపించిన బ్రాహ్మణవిరోధి, సంఘ సంస్కరణా సంఘం సత్యశోధక సమాజంలో మొట్టమొదట్లో చేరిన సభ్యుల్లో ఆమె తండ్రి ఒకరు. పూలే వీరి కుటుంబానికి దగ్గర స్నేహితులుకూడా. తారాబాయి మరాఠీ చదవటం, రాయుటమే కాకుండా కొంతవరకు ఇంగ్లీషూ, సంస్కృతం కూడా నేర్చుకున్నారు.

ఈ సంబంధాలన్నీ ఉన్నా, మరాఠాల్లోని గొప్పకుటుంబాల్లో ఒకరైన షిందేలు స్త్రీల పట్ల కొన్ని కట్టుబాట్లు పాటించేవారని మనం అనుకోవచ్చు. తారాబాయి స్వయంగా తాను పూర్వకాలపు మరాఠా పద్ధతిలో నాలుగు గోడల మధ్య పెరిగిన దాన్నని చెప్పుకుంది. ఆమె కోసం ఇల్లరికపు వరుణ్ణి చూసి వివాహం చేశారు. దీని మూలాన ఆమె భర్త షిందే- ఇది ఎలాగైందో తెలియదు కానీ ఆయన పేరు కూడా షిందేనే-తన ఇల్లు వదలి ఆమె తండ్రి ఇంట్లో వచ్చి నివసించాల్సి వచ్చింది. కూతుళ్ళను తమ దగ్గరే ఉంచుకోవాలనే ఆశతో, తక్కువ కుటుంబాలనుండి వచ్చినవారైనా సరే, తక్కువ చదువు గలవారైనాసరే, ఇల్లరికపు అల్లుళ్ళను తెచ్చుకునే శ్రీమంతులైన మామగార్లపైన తారాబాయి కష్టంతోనే రాశారు. బహుశ అలాంటి వివాహం వలననే గారాబపు తండ్రివద్ద పుట్టింటి జీవితంలో ఆమె ఆ రోజుల్లో కొంత ఎక్కువ స్వేచ్ఛా స్వతంత్రాలనే అనుభవించి ఉండాలి. ఆ అవకాశమే పురుష

ప్రపంచమైన చదువు, రాయటం, ప్రచురించటం వంటి వాటిలో ఆమెకి ప్రవేశం దొరికేలా చేసి ఉండాలి. తారాబాయి ఎప్పుడు విధవరాలైందో మనకు తెలియక పోయినా భర్త పోయింతరువాత ఆమె చాలాకాలం జీవించి ఉందని తెలుస్తుంది. వాళ్ళకి పిల్లలు లేరు. కానీ ఆమె పునర్వివాహం మాత్రం చేసుకోలేదు.

పందొమ్మిదో శతాబ్దంలో బ్రిటిష్ పాలనలో ఉన్న భారతదేశంలో పరిస్థితులేమిటి? బ్రిటిష్ రాజ్యంలో కొత్తగా లభిస్తున్న ఉద్యోగాల కోసం, అధికారాల కోసం కులపరంగా, సంఘ పరంగా పోటీ లెక్కువయ్యాయి. పల్లెప్రాంతాల్లో మధ్య, పెద్దరైతు కులాల పోటీలో పెళ్ళిళ్ళు చేసే పద్ధతులూ, స్త్రీల పై కట్టుబాట్లూ కొంత కొత్త ప్రాముఖ్యత సంతరించుకున్నాయి. సంఘ సంస్కరణోద్యమాలలో కూడ స్త్రీలకు సంబంధించిన విషయాలే ముఖ్యమైన చర్చనీయాంశాలైనాయి. బహుశకులం, అంటరానితనం కాక మిగిలిన హిందూ సంస్కరణ వాదులు దృష్టి కేంద్రీకరించిన సమస్యలన్నీ స్త్రీల పరమైనవే-సతి, ఆడపిల్లలను పురిట్లోనే చంపెయ్యటం, బాల్య వివాహం, విధవా పునర్వివాహం, స్త్రీలపై కట్టుబాట్లు, స్త్రీవిద్య, వేశ్యావృత్తి, వరకట్నం మొదలైనవి.

ఈ మధ్య జరుగుతున్న పరిశోధనలు చూపించేదేమిటంటే పందొమ్మిదవ శతాబ్దంలో భారతదేశంలో సాంఘికంగాను, రాజకీయంగానూ 'జండర్' చాలా విచిత్రమైన ప్రాముఖ్యం పొందిందని. స్రీలను మరింతగా సాంఘిక కట్టుబాట్లలో బిగించటమనేది కొన్ని సంఘాల, వర్గాల ఉనికికి చాలా అవసరమైంది. నిజానికి ఆంగ్ల సామ్రాజ్యపు అధికారమే వారి ఆఫీసర్లూ, సంఘ సంస్కరణ ఉద్యమాల్లో మునిగితేలుతున్న ముఖ్యమైన వర్గాల పురుష ప్రతినిధుల మధ్య జరిగిన ఈ చర్చలపై నిలబడింది.

పందొమ్మిదవ శతాబ్దపు భారతదేశంలో హిందూ సంఘం అన్ని వర్గాలలోనూ బ్రాహ్మణ మతభావాలూ, గ్రంథాలూ ప్రాచుర్యం పొందాయి. ఒకప్పుడు కొద్దిమందికే పరిమితమైన ఈ విలువలు సంఘంలో హోదా, ప్రతిష్టలకు సంబంధించినవి, ఈ సమయంలో మధ్య, పై తరగతుల రైతు కుటుంబాలకూ, ప్రభుత్వ ఉద్యోగులకూ, వ్యాపారస్థులకూ కూడా ఆదర్శప్రాయాలైనాయి. కులాధి పత్యాలు అధికమై కులాలమధ్య గోడలు కూడా బలంగా లేచాయి. కులం, ఆచారాలూ, కుటుంబం మార్పులేని స్వకీయ విషయాలుగా, బ్రిటిషు వారి రాజకీయ పరిధులకావల విషయాలుగా పరిగణింపబడ్డాయి.

కొత్తగా హిందూ సమాజంలో ఆదర్శప్రాయాలుగా చలామణి అవుతున్న వాటిలో పరదా ఒకటి తారాబాయిని ముఖ్యంగా కలవర పరచిన విషయం కాగా, స్త్రీలు పునర్వివాహం చేసుకునే హక్కూ, సంఘంలో స్త్రీల స్థానం మిగిలినవయ్యాయి. కొంతమంది చరిత్రకారులు చెప్తున్నదేమిటంటే సతీ అనే దురాచారం భారతసమాజంలో అతిచిన్న వర్గంలోనే అనుసరించబడినా, సత్యానికి విరుద్ధంగా సామ్రాజ్యవాదులు, చరిత్రకారుల దృష్టిలో ఇది చాలా ప్రాముఖ్యం సంతరించుకుంది. విధవా వ్యవస్థ విషయంలో కూడా అదే జరిగింది. ఇంకొక విచిత్రమైన సంగతేమిటంటే సతి, విధవా పునర్వివాహంపై కట్టుబాట్లు ఆదర్శ ప్రాయమైనవిగా వ్యాప్తిచెంది వాటికి ఏ మాత్రం సంబంధం లేని ఎన్నో వర్గాల స్త్రీలపై ప్రభావం చూపి స్రీలను అన్ని విషయాలలో లొంగి ఉండేట్లు, తమ గురించి

ఆలోచన లేని వారిగానూ తయారు చేశాయి. తారాబాయి కూడా విధవలు సంఘంలో పడే అవస్థలే కాక విధవావస్థ పట్ల భయం వివాహితస్త్రీల ప్రవర్తన మొత్తాన్నీ ఎలా నియంత్రిస్తుందో తనను కలవరపెట్టిందని చెప్పారు.

ఆశించినట్లే తారాబాయి పుస్తకం జనంలో చాలా వ్యతిరేకత రేకెత్తించింది. పూలే 1882లో ఈ వ్యతిరేకత, జనం ఈ పుస్తకాన్ని, తక్కువ చేసిమాట్లాడం గురించిరాశారు. తారాబాయి ఆరోజుల్లో ఉదారమైన సంఘ సంస్కరణాభిలాషగల వాతావరణం జీవించలేదు కనుక భారతదేశం కొన్ని ప్రాంతాల్లో కమలా సతియానాధన్ లాంటి రచయిత్రులు పొందినంత గుర్తింపు, జనాదరణ పొందలేదు. ఒకవేళ అలా పొంది ఉంటే ఆమె అభిప్రాయాలు ఇంతబలంగా, ఇంత ఆసక్తికరంగా ఉండేవి కాదేమో!

'జండర్' ఈ విధంగా ముఖ్యమైన రాజకీయ సంబంధాలపై ప్రభావం కలిగి ఉండగా, తిరిగి వాటి ప్రభావంలో 'జండర్' కూడా రూపుదిద్దుకుంది. పందొమ్మిదవ శతాబ్దంలో సృష్టించిన ఆదర్శప్రాయమైన స్త్రీ రూపం బలమైన ప్రభావంకలిగి ఇరవైవ శతాబ్దంలో కూడా సతీ-సీతా-సావిత్రి ఆదర్శరూపం నిర్మించటానికి, ఈ రోజుకీ అనుసరించటానికీ దారితీసింది. ఇలాంటి స్త్రీల ఆదర్శం-హిందూరూపం పొందిన పరదా, స్త్రీలు అతి నమ్రత, బిడియాలతో బయట ప్రపంచంలో నడచుకోవటంతో సహా-కొత్తగా బలం పుంజు కుంటున్న రైతుకులాలవారికి ముఖ్యమైనాయి. ఈ కొత్తగా అధికారాన్ని చేజిక్కించుకున్న మధ్య, పైతరగతి రైతుకులాలవారే ఈ రోజు సంఘంలో స్త్రీలను విపరీతంగా అణగదొక్కే సంస్కృతిని ప్రోత్సహిస్తున్నారు.

ఆ కాలపు స్త్రీల జీవితాలను, రచనలనూ, వెలుగులోకి తీసుకురావటం వాళ్ళ జీవితాల గురించి మనం తెలుసుకునే విషయాలవల్లేకాక, అవి లేవనెత్తే కొత్త సాంఘిక ప్రశ్నలు, సాంఘిక చరిత్ర విషయంలో అవి కలిగించే కొత్త అంతరదృష్టివలన కూడా అమూల్యమైనవవుతాయి. ఈ చిన్న పుస్తకం తెలుగుపాఠకులకు, ఆంధ్రప్రదేశ్‌లో మరుగులో ఉన్న స్త్రీలనూ, స్త్రీలగ్రంథాలను వెలుగులోకి తీసుకురావటంలోనూ, తిరిగి రాయటంలోనూ, స్ఫూర్తినిస్తుందని ఆశిస్తున్నాము.



హైదరాబాద్ బుక్ ట్రస్ట్
అగస్టు, 1999

(మరో మాటకు ఈ క్రింది పుస్తకం, వ్యాసముల నుండి ఎక్కువ సమాచారం సేకరించాము)

1. Comparison Between Women and Men : Tarabai Shinde and the Critique of Gender Relations in Colonial India, Rosalind O'Hanlon, Oxford University Press, Madras 1994.

2. Negotiating Strategies with Hindu Patriarchy, Vidyut Bhagwat, The Book Review, Vol. XVIII, Number 10)

42

**"ముందు మీరిది చెప్పండి, అసలు వేశ్యలంటే ఎవరు?**
**...నిజానికి వేశ్యలనే వాళ్ళు మీరు మోసం చేసి ఇంట్లోనుండి**
**తీసుకెళ్ళి పోయివదిలేసిన వాళ్ళే".**

దాదాపు వందేళ్ళ క్రితం ౧౮౮౨లో తారాబాయి షిందే మరాఠీలో రాసిన బానిస భారతదేశంలోని మొట్టమొదటి ముఖ్యమైన స్త్రీ వాద పుస్తకం తెలుగు అనువాదం ఇది. మహారాష్ట్రలో బుల్‌ఠాణేలో తారాబాయి జీవించారు. ఇది ఆమె ప్రచురించిన ఒకే ఒక పుస్తకం. ప్రతి సామాజిక దురాచారానికి, రకరకాల దురవస్థలకి భారతదేశంలో స్త్రీలనే ఎప్పడూ కారణభూతులను చెయ్యటం చూసిన తారాబాయి ఆవేశంతో రగలిపోయింది. ప్రతికూలమైన పురుష పాలక ప్రపంచాన్ని తాను ఒంటరిగా ఎదుర్కొంటున్నాననే భావనతోనే ఆమె అసలు దోషులైన పురుషులను కఠినంగా అధిక్షేపించటం మొదలు పెట్టింది. సర్వ స్వతంత్రాలూ, హక్కులూ పురుషులు చేతుల్లో ఉంచుకుని, సంఘంలోని సర్వ దురాచారాలకి స్త్రీలని బాధ్యులు చేశారు. ఒక స్త్రీ ఇంత ధైర్యంగా, తార్కికంగా పురుషులతో స్త్రీల సంబంధాల గురించి చర్చించిన మొట్టమొదటి భారతీయ పుస్తకం ఇదే!

జ్యోతిబాఫూలేతోనూ, ఆయన స్థాపించిన సత్యశోధన సమాజంతోనూ తారాబాయి కుటుంబానికి దగ్గర సంబంధాలుండేవి. సెప్టెంబరు ౧౮౮౫లో వచ్చిన తన చిన్న పత్రిక 'సత్సార్' (సత్యవారం) లో ఫూలే తారాబాయి గురించి రాశారు. "ఈ రోజు ఇంగ్లీషు ప్రభుత్వం అధికారం వలన ఈ దేశపు పీడిత స్త్రీలలో కొందరు సంకోచంగా చదవటం రాయటం నేర్చుకోవటం మొదలు పెట్టారు". తారాబాయిని 'చిరంజీవి, మన ముద్దుల ఆడపడుచు' అంటూ ఆమె పుస్తకం రాయటంలోని ఉద్దేశం వివరించారు- మగవాళ్ళ చేతుల్లో బాధలుపడే స్త్రీల కోపాగ్నిని వ్యక్తం చెయ్యటం, మగవాళ్ళు ఎలా ఉంటే మళ్ళీ తమ స్త్రీల ప్రేమ, విశ్వాసం పొందగలరో స్పష్టంగా చెప్పటం ఆమె ధ్యేయం.

అనువాదకురాలు సి.ఎల్.ఎల్. జయప్రద ఆంధ్రాయూనివర్శిటీలో ఆంగ్ల సాహిత్యం బోధిస్తుంటారు. ఆమె తెలుగు నుండి ఇంగ్లీషులోకి, ఇంగ్లీషు నుండి తెలుగులోకి చాలా కథలు అనువదించారు. ఆమె అనువాదం చేసిన డా.కేశవరెడ్డి నవల **అతడు అడవిని జయించాడు** ను ౧౯౯౮లో మాక్‌మిలన్ వారు He Conquered The Jungle పేరుతో ప్రచురించారు.



హైదరాబాద్ బుక్ ట్రస్ట్

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | DVK01K320 | Date | 16/4/2022 |
| Front Cover | Yes | Back Cover | Yes |
| Blank Pages | (I, II, 41 | | |
| Missing Pages | No | | |
| Prepared By | Amrutha | Cutting By | Amrutha |
| Scanned By | Lakshmi | Pages | 53 |